

# జనవరి 1976

సచిత్ర మాసపత్రిక సంపుటి: 13: సంచిక: 12

## విషయసూచిక



ముఖచిత్రం: జగపతి స్టాఫ్ ఎంటర్‌ప్రైజెస్ వారి "పిచ్చిమారాజు"లో శోభన్‌బాబు, మంజుల

సంస్థాపకులు: కీ. శే. వి. వి. రాఘవయ్య

మేనేజింగ్ ఎడిటర్: శ్రీమతి వి. లీలావతి రాఘవయ్య

జ్యోతి, 40/1 మూసాసేట్ స్ట్రీట్, టి. నగర్, మద్రాసు-600017.

# తొలిమాట

భర్త మరణానంతరం స్త్రీ జీవితానికీ, భార్య మరణానంతరం పురుషుని జీవితానికీ ఎంత తేడా! అందునా యవ్వనంలో ఉండగానే విధవ అయిన స్త్రీకీ, వయసులోనే భార్యను పోగొట్టుకొన్న మగవానికీ ఎంతో తేడా!

ఈ సమస్య ఈనాటిది కాదు ఎప్పటినుండో వస్తున్నదే. అయితే ముప్ఫైనలభై సంవత్సరాల ముందు కాలానికీ, ఇప్పటికీ వచ్చిన మార్పులు కాదనలేము. అప్పట్లో విధవావివాహం అసంభవం గానే ఉండేది ఇప్పుడలా కాదు, అది సంభవమే కాని అందుకెంత ప్రయత్నం కావాలి?

ఈ సమస్య ప్రధానంగా మలచిన నవల 'సంఘం చెక్కిన శిల్పాలు'. ఈ సంచికతోపాటు రంగుల ముఖచిత్రపు ముస్తాబు చేసుకొని మీ కందించబడుతోంది

ఈ నవలలోని సమస్యపై పాఠకులు తమ అభిప్రాయాలను పంచుకోవడానికి జ్యోతి ఉత్తరాల శీర్షికను చర్చావేదికగా ఉపయోగించుకోవచ్చు

*　　*　　*

మీ కోసం త్వరలో కొత్త సీరియల్ ప్రారంభమవుతూంది ప్రఖ్యాత రచయిత్రి శ్రీమతి అరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి 'సత్యం శివం సుందరం' నవలను త్వరలో సీరియల్‌గా ప్రచురిస్తున్నామని తెలుపుటకు ఆనందిస్తున్నాము. జ్యోతి మీ కందించబోయే మరికొన్ని ఆకర్షణల వివరాలు లోపల పేజీలలో చూడగలరు.

వె. రాఘవేంద్రరావు

మీ ఇంటిని హాయిగా ఉంచుకోవాలంటే
ఒకసారి సందర్శించండి
చీరెలు, దుప్పట్లు కర్టెన్లు ఇంకా అన్నిరకాల
గుడ్డలకి మీరు కోరుకున్న మేలయిన అద్దకమును
పొందగలరు

# బాటిక్ హోమ్

మోహన టెక్స్‌టైల్స్ ప్రాసెసర్స్
185, రాయపేట హైరోడ్, మద్రాసు-600014



**FREE!** ఉచితం

# విషపు విత్తనాలు-చేదు ఫలాలు

మే 18 వ తా॥ హైదరాబాద్ చంచలగూడ స్త్రీల విభాగములో ఖైదీగ వుంచబడిన 30 సం॥ మున్నీ దేవి జైలు గదిలో చీరెకు నిప్పు అంటించుకొని ఆత్మ హత్య చేసుకుంది దానికి కారణము తన భర్త సహ ఉద్యోగియైన యాదవ్ అను నతనితో భర్త ఏదో ఊరు వెళ్ళినప్పుడు అక్రమ సంబంధం ఏర్పచుకుంది. తను యాదవ్ చేసిన పాపక్రియలు పెద్దకొడుకు (12 సం॥) వాడు చూసినందున భర్తకు చెప్పగలడనే భయంతో ఆ బాలుడిని ఇద్దరూ కల్సి హత్య చేశారు. పోలీసులు పట్టుకున్నారు. మున్నీదేవికి యావజ్జీవ ఖైదు, యాదవ్ కు ఉరిశిక్ష విధించారు. జీవితాంతం కలవరపెట్టే మనస్సాక్షిని ఎదిరించలేక ఆమె ఆత్మహత్య చేసుకుంది

పాపపు ఆకర్షణ ఎంతలో అంత్యమయిందో తెలుసుకున్నారా? పాపపు భోగం ఒక్క క్షణం. మన పాపం మనలను పట్టుకోగలదు పాపం చేసి "తప్పించుకున్నాను" అని ఒక్క క్షణం ఆనందించినా మనస్సాక్షిని కలత పెట్టి ఆత్మహత్య చేసుకోనేంతగా నిన్ను బాధించగలదని నీకు తెలుసా? ఇతరులకు చేసిన బాధ, మోసం వెయ్యిరెట్లు అధిక వేగంతో వచ్చి అంత మొందింపక తప్పదు. విషపు విత్తనాలు వెదజల్లితే చేదుఫలం అందుకొనక తప్పదు. సమయముండగానే చేస్తున్న పాపపు పనులు విడిచి, నిజమైన పశ్చాత్తాపముతో ప్రభు పాదములు పట్టుకొని క్షమించమని వేడుకో.

—చదలవాడ చంద్రమతీదేవి

ఉచితం! ఉచితం! ఉచితం!

మీకు బైబిల్ కు సంబంధించిన ఉచితంగా లభించే అందమైన పుస్తకాలు కావాలనుకుంటే, ఒక పోస్టుకార్డు మీద మీ అడ్రసు స్పష్టంగా వ్రాసి మాకు పంపండి పోస్టు ఖర్చులు కూడా మేమే భరించి మీకు ఉచితంగా పుస్తకం పంపుతాము.

ఇదీ అడ్రస్

FAR CORNERS
P. Box-315
Vijayawada-2
ఫార్ కార్నర్స్
పోస్టు బాక్స్ 315
విజయవాడ - 2

Gospel Message Inserted by FAR CORNERS,
Post Box 315, Vijayawada - 520002.

# ఉత్తరాలు

నటరత్న ఎన్ టి రామారావు గారి ముఖచిత్రంతో మా చేతికందిన

డిసెంబరు నెల 'జ్యోతి' ని చదివి అమితానందపరవశుల మయ్యాము. "అక్కా-చెల్లెళ్ళ - అనుబంధం" అను మినీ కథ చదివాక నవ్వును ఆపుకోలేక పోయాము కన్నెవయసులలో ఉన్న అక్కా-చెల్లెళ్ళ మధ్య ఎంత అనురాగం ఆప్యాయతలుంటాయో, భర్తలను చేసికొని, సంసారాన్ని సాగించేటపుడు, అలాంటి ప్రేమానురాగాలు, అడుగంటడము సహజమే. ఈ కథలో చక్కటి ఉదాహరణ ద్వారా తెలిపారు రచయిత గారు.

—మహామ్మద్ జహీర్ అహామద్,
వనపర్తి

ఎదురులేని మనిషి (ఎన్. టి. రామా రావు) ముఖచిత్రంతో వెలువడిన డిసెంబర్ నెల 'జ్యోతి'లో ఎ. శ్యామలారాణి గారి "జై మంగళా" సీరియల్ ఎంతో బాగుంది. మాదిరెడ్డి సులోచన విరచిత మైన "మిస్టర్ సంపత్, ఎం ఏ." సీరియల్ పాఠకుల హృదయాలను పరవశింప జేస్తూ ఉత్కంఠత కలుగజేస్తున్నది.

పంతుల జోగారావు గారి "అక్కచెల్లెళ్ళ అనుబంధం" మరియు కృష్ణ కుమారిగారి "పొరపాటు" కథలు చాల చిన్నవైనా ఎంతో ఆసక్తికరంగా ఉన్నవి

నవలానుబంధంలో ప్రచురించిన అవసరాల రామకృష్ణారావుగారి "రామ చిలక" నవలానుబంధం వాస్తవికమైన సంఘటనలతో ఎంతో బాగుంది. రచయిత గారి మధుర మంజుల శైలికి నా ధన్యవాదాలు.

—సిరికొండ వెంకటేశం,
యం. అంజయ్య, కరీంనగర్.

ప్రస్తుతం మీరు సీరియల్ గా ప్రచురిస్తున్న మల్లాది వెంకటకృష్ణమూర్తిగారి 'మూడు రాత్రులు' చాలా ఇంటరెస్టింగ్ గా సాగుతోంది. తన ప్రతి రచన లోనూ ఏదో ఒక కొత్త ఎక్స్పెరిమెంట్ చేసే వీరి రచనలంటే నాకెంతో ఇష్టం అయితే డిసెంబరు సంచికలోని 'మూడు రాత్రులు'లో ఓ చిల్లి తప్పు దొర్లింది! రవివర్మా, అతడి మిత్రుడూ టేబిల్ టెన్నిస్ ఆడుతూ వుంటారు, కబుర్లు చెప్పుకుంటూ! స్కోరు 'ట్వంటీ-ఈచ్' అవుతుంది ఒక్క పాయింటే మిగిలి వుందంటాడు రవివర్మ గేమ్ అయిపో డానికి! 'ట్వంటీ-ఈచ్' అయ్యాక రెండు పాయింట్ల తేడా వుంటేగాని గేమ్ అయిపోదని తెలియదా? ఇది చిన్న తప్పేకాని, తప్పు తప్పే కదా. సరిగా తమకు తెలియని విషయాన్ని అంత వివరంగా రాయకుండావుంటే బావుంటుంది మన రచయితలూ, రచయిత్రులూ! (టేబిల్ టెన్నిస్ ఆట గురించి తమకు బాగా తెలుసనీ, రవివర్మకూ, అతడి మిత్రుడికీ సరిగా తెలియదనీ చెప్పి తప్పుకోవచ్చునుకోండి!)

—ఆర్ ఇందిర, హైదరాబాద్.

డిసెంబరు జ్యోతిలో శ్రీ మల్లాదివారి "మూడు రాత్రులు" కొత్త పంథాలో నడుస్తూ, గిరిజనుల ప్రేమలూ, కక్షలూ, వారి ఆచారాలూ చాలా బాగా తెలియ చేస్తుంది

అవసరాల రామకృష్ణారావుగారి "రామచిలుక" నవల చాలా బాగుంది. కలవారు, మధ్యతరగతి బీదాబిక్కీ కుటుంబాలలో, విద్యావంతులలో, విద్యావిహీనులలో ప్రతి నిత్యమూ జరిగే పద్ధతులూ, స్వార్థమూ, పాతకొత్త కలయికల సంఘర్షణలూ, కుటుంబాలలో వాటి ఫలితాలూ, మొదలైన విషయాలూ చాలా చక్కగా విశదీకరించారు బొత్తిగా ప్రేమ-పెళ్ళి నవలలే కాకుండా, మారుతున్న, మారవలసిన సంఘానికి కావల్సిన విషయాలతో అందంగా తీర్చిదిద్దిన రచయితగారికి నా హృదయపూర్వక నమస్కృతులు రచయితలు ఈ యుగ సంధిలో సంఘానికి అవసరమైన మార్పులను, చేర్పులను మనసులో పెట్టుకుని రచనలు చేస్తుంటే చాలా బాగుంటుంది. 'రుక్మిణీ కళ్యాణం' నీతి కథ మామూలు పంథాలో నడచి బాగున్నాయి మొత్తం మీద డిసెంబరు జ్యోతి చాలా బాగుంది.

—సమయమంత్రి రాజ్యలక్ష్మీదేవి
హైదరాబాద్

# జ్యోతి

## మీ కందించే

# క్రొత్త ఆకర్షణలు

వివరాలకు పేజీ తిప్పండి!

---

డిసెంబరు నవలానుబంధంలో ప్రచు
ంచబడిన "రామచిలుక" నవల ఇంట
రెస్టింగ్ గా సాగిపోయింది. ఆ శైలిలో
ఉత్సాహం కలిగించే రీతిలో రచన
సాగించిన రచయిత అవసరాల రామ
కృష్ణారావుగారు అభినందనీయులు. కథ
ంలో రుక్మిణీ కళ్యాణం, వక్రీభవనం
బాగున్నాయి. అక్క చెల్లెళ్ళ అనుబంధం
కథ అసహజంగా ఉన్నది. మూడు
పాత్రులు మినీ సీరియల్ సరదాగా సాగి
పోయింది. పూలదండ కథ వెనుక కథ
చదివిన తరువాత మాకు చాల బాధని
ంచింది.

—మణి, రాజు, బాబ్జీ, బొంబాయి.

నవంబరు నెల 'జ్యోతి' నవలాను
బంధంలో ప్రచురింపబడ్డ 'పొగమంచు'
గురించి, డిసెంబరు మాసపు సంచిక
తొలి మాట'లో తమ ప్రస్తావన, తదను
గుణంగా సుప్రసిద్ధ రచయిత్రి శ్రీమతి
కొమ్మూ హేమాదేవిగారి సమాధానం
రెండూ సమంజసంగానే ఉన్నాయి.
రచనలు పాతవయినా (చౌర్యం కానంత
వరకూ) సమాజానికి దగ్గరగా వాస్తవ
పరిస్థితులను ప్రతిబింబిస్తే, వాటిని మరో
సారి రచయితల అనుమతితో ప్రచురిం
చడం ఏమాత్రం గర్హనీయం కాదు.
పైగా ఎంతో ప్రయోజనకరం. ఈనాడు

అవాంఛనీయ కల్పిత ప్రేమగాథలకంటే
ఇది ఎన్నోరెట్లు నయం.

—కె. లింగమూర్తి, లక్ష్మి,
హైదరాబాద్.

జ్యోతి డిసెంబర్ నెల సంచిక ఎదురు
లేని సంచికగా ముఖచిత్రంపై ఎదురులేని
మనిషిని వేయడం మాకెంతో నచ్చింది.
"జై మంగళా" సీరియల్ లో ముస్ముందు
ఏమి జరుగునో అన్నంత ఉత్కంఠతో
నడుస్తున్నది రుక్మిణీ కళ్యాణం. పార
పాటు, మరమరాలు_పావలా (నవలాను
బంధంలో) బాగున్నవి.

"రామచిలుక" నవలానుబంధంలో
కథ మొదలు అంత సాఫీగా నడువ
కున్నా మధ్యనుండి తండ్రి, కొడుకు,
కోడలు మధ్య కథ నేటి సమాజానికి
దర్పణమువంటిదిగా రచయిత చక్కగా
చిత్రించారు రచయిత అవసరాల రామ
కృష్ణారావుగారు ఎంతైనా అభినంద
నీయులు.

జ్యోతి క్రొత్త సంవత్సరములోకి
అడుగిడుచున్న సందర్భములో మా
యొక్క నూతన సంవత్సర శుభాకాంక్షలు
అందజేస్తున్నాము.

— జె. ఆర్. విద్యాసాగర్,
ఆర్. రాజేందర్ సింగ్,
యం. బుచ్చయ్య, బి. వెంకటేశం,

తెరలో ప్రారంభం!

# క్రొత్త సీరియల్

మీరు మెచ్చిన రచయిత్రి

## ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి

రచన

# సత్యం శివం సుందరం

నవల త్వరలో సీరియల్‌గా ప్రారంభం!

# మీకు నచ్చే ముత్యాల్లాంటి మూడు శీర్షికలు !

## సామెతల కథలు

తెలుగు భాషకు ఎనలేని అలంకారాన్ని సమకూర్చినవి ఎన్నో సామెతలు. ఆ సామెతల వెనుక ఆసక్తికరమైన గాదలు. వీటి వివరాలు నెలనెలా మీ కందిస్తుంది జ్యోతి. ఈ శీర్షికను ప్రఖ్యాత రచయిత యామిజాల పద్మనాభస్వామి నిర్వహిస్తారు. వచ్చే సంచికనుంచే ప్రారంభం !

---

## గోపాలభూపాలం

వినోదం, విమర్శ, విశ్లేషణం ప్రధాన గుణాలుగా నడిచే యీ శీర్షిక మీకు జ్యోతి అందించే ఓ మణిపూస పూర్తి వివరాలు వచ్చే సంచికలో !

---

## గాంధీగారి రాజ్యంలో గాంధారి కొడుకులు !

మానవ జాతిలో 'దృష్టి'దోషం ఎంతమందికుందంటే ఓ కంటివైద్యుడు నూటికి ఏభైమందికనో, అరవైమందికనో చెప్పొచ్చు. కాని వ్యంగ్య రచనలో సిద్ధహస్తుడయిన సి. (సింపుల్‌గా), వి. (వ్యంగ్యంగా), రమణ (రమణీయంగా) చెప్పే సమాధానం మనలో నూటికి నూరుపాళ్ళూ దృష్టిదోషం కలవాళ్ళేనని. ఈ శీర్షికలోని రచనలు చదివాక మీకూ దృష్టి దోషముందని అనుకొంటే మా బాద్యతేం లేదు! ఈ శీర్షిక కోసం మీరు కళ్ళు కాయలయ్యేలా ఎదురుచూడనక్కరలేదు

# పారిజాతము

ఆలనాడు శ్రీకృష్ణుడు సత్యభామ అలక తీర్చడానికి పారిజాత కుసుమం కోసం రాత్రిక రాత్రి దేవేంద్రుని నందనవనం నుండి పారిజాత వృక్షాన్నే దొంగిలించిన గాథ మనందరకు తెలిసినదే. అలా పురాణాల్లో ప్రసిద్ధికెక్కింది పారిజాత పుష్పం

అదెలాగున్నా ప్రస్తుతం మనకు వాడుకలోనున్న పారిజాతం నారింజరంగు కాడలతో నున్న తెల్లని పూలతో ఆకర్షణీయంగా అందంగా సువాసనగా వుంటుంది. రాత్రుళ్ళు సుమారు ఎనిమిది గంటల ప్రాంతంలో ఈ పూలు విచ్చుకుంటూ ప్రక్కలకు తమ సువాసనలు వెదజల్లుతాయి.

ఆ టైములో చెట్టు దగ్గరకు వెళితే గుబురుగా నున్న చెట్టు నిండా విచ్చుకుంటున్న పారిజాతాలు నక్షత్రాల్లా అందంగానూ సెంట్ క్వీన్ తో సరితూగే సువాసనతోనూ మనల్ని కదలనీయవు. తెల్లవారి లేచి చూస్తే చెట్టు క్రింద రాలి వుంటాయి ఈ పూలు పూజార్హమైనవి

పోతే పారిజాతం వైద్యానికి కూడ ఉపయోగపడుతుంది

పారిజాతపు ఆకుల రసం ½ ఔన్సు రసంతో 4, 5 గ్రాముల మిరియాల పొడి కలిపి లోపలికి తీసుకుంటే క్రిములు హరిస్తాయి ఆకుల రసంగాని పూల రసంగాని 5, 6 చుక్కలు చెవిలో వేస్తే చెవి పోటు తగ్గుతుంది.

ఈ ఆకుల రసంగాని కషాయంగాని జ్వరాలు, మేహవాత నొప్పులు నడుం నొప్పి మొదలైనవి పోగొడుతుంది

ఆకు రసంతో కొద్దిగా ఉప్పు చేర్చి యిచ్చినా క్రిమిదోషం పోతుంది. తేనె కలిపి యిస్తే (ఆకు రసంలో) పురాణ జ్వరాలు తగ్గుతాయి. 6,7 లేత ఆకులతో కొద్దిగా అల్లం చేర్చి నూరియిస్తే కూడ జ్వరాలు తగ్గుతాయి.

విత్తుల చూర్ణం నీళ్ళలో కలిపి పూస్తే తలమీద పొక్కులు చుండ్రు తగ్గుతుంది

ఆకులు మెత్తగా దంచి ఆముదంతో వెచ్చజేసి కడితే వాతపు నొప్పులు, కంతులు తగ్గుతాయి

పారిజాతపు గింజలు మాడ్చిన మసితో హారతి కర్పూరం, కొబ్బరినూనె కలిపి రాస్తే గజ్జి, చిడుము, వ్రణాలు మాని పోతాయి

5 గ్రెనుల పారిజాతపు చెక్క, ఒక పోక చెక్క తమలపాకులో చుట్టి నమిలితే శ్లేష్మము హరిస్తుంది

ఆ యాకు పప్పులో వేసి కూరగా చేయవచ్చు అలా చేసిన కూర పైత్యాన్ని మలబద్దకాన్ని పోగొడుతుంది. మూత్రాన్ని జారీచేస్తుంది. ఈయాకు నరాలకు సత్తువనిస్తుంది. చలవచేస్తుంది. పూలు రసం పిండి ఆ రసాన్ని ఎండలో పెడితే క్రమంగా గట్టిపడుతుంది. ఇది తిలకానికి బదులు ముఖాన బొట్టుపెట్టుకుంటే బాగుంటుంది. సువాసనగ కూడ వుంటుంది.

—సుగుణ

# స్నేహమంగళ

## ఎ. శ్యామలారాణి

జరిగిన కథ: చిన్నతనంలోనే తల్లి దండ్రుల్ని పోగొట్టుకున్న మంగళకు అండగా నిలిచి ఆమె ఆస్తిపాస్తుల్ని సంరక్షించి ఆదరించాడు చౌదరి. రామం కుటుంబంలో దాదాపు ఒక మనిషిగా మసలేది మంగళ. రామం భార్య గౌరి అంటే ఎంతో అభిమానం. రామం తమ్ముడు రాజంటే ఎంతో అనురాగం ఆమెకు. రాజు చదువుకు డబ్బు సాయం చెయ్యా డానికి తనకున్న ఒక్క ఆధారమూ అయిన యిల్లు అమ్మేసింది మంగళ. పట్నంలో పెరిగి చదువుకున్న గౌరి, మురళీబాబును ప్రేమించీ అతన్ని పొందలేక పోయిందన్న విషయం ఒక సందర్భంలో గౌరే చెప్పింది మంగళకు. ఇల్లు అమ్మిన మంగళని తన యింట్లోనే వుండ మన్నాడు రామం.

### 4

తూరుపు దెస తెలతెలవారుతూంది. ఇంటి ముందు పేడకళ్లాపి జల్లి, రంగవల్లి తీర్చి, గుమ్మానికి మామిడి తోరణం తగి లించి పండగ రోజులా హడావిడి పడి పోతూంది గౌరి. నిద్ర లేచిన కన్న ఇక పిన్ని ఎప్పుడూ వాడితోనే ఉంటుందని తెలుసుకుని చప్పట్లు కొడుతూ, గెంతు లేసుకుంటూ మురిసిపోతూ, రోజులా అల్లరి చెయ్యకుండా చకచక తెమిలిపోయి వాడికెంతో ఇష్టమైన తెల్ల నిక్కరు, ఎర్ర చొక్కా తొడిగేసుకుని వెదురు పుల్లల విల్లంబులతో రాజకుమారుడి,, పోజులో వాకిలంతా, పెరడంతా పరుగులెడుతు న్నాడు.

రోజూ పాలచెంబుతో వచ్చే మంగళ ఆరోజు ఏకంగా ఆవు, దూడతో సహా ప్రత్యక్షమయింది. ఈ రోజు నుండి తన జీవితంలో ఏదో మార్పు వస్తూంది. రాజు తన మెడలో మూడు ముళ్ళు వెయ్యా కుండానే తను ముందుగా గృహప్రవేశం చేసేస్తూంది. ఏవేవో తీపి తలపులు చుట్టు ముడుతూంటే సిగ్గుగా తల దించుకుని గడప దగ్గరే ఆగిపోయింది.

"రా రా మంగళా! ఆగిపో యావేం? హారతిచ్చి తీసుకొచ్చే రోజు



ఇంకా ముందుందిలే !'' హాస్యమాడుతూ చేయి పట్టుకుంది గౌరి.

''సరి సర్లేకాని,ఇవన్నీ ఏమిటీ'' అంది తెలివి తెచ్చుకుని గుమ్మానికి కట్టి వున్న మామిడి తోరణాల కేసి ఆశ్చర్యంగా చూస్తూ గౌరి ఏదో అర్థం స్ఫురించేలా కొంటెగా నవ్వి చిన్నగా కన్ను గీటింది.

''నయమే, ఎవరైనా చూస్తే నవ్వి పోగలరు. అసలిప్పటికే వూరంతా గుప్పు మంటూంది.''

''నవ్వినా, ఏడ్చినా నా కెవరితోనూ నిమిత్తం లేదు మంగళా' అంతగా ఎవ రైనా అడిగితే ఇదే చెప్తాను' మా ఇంటికి రాబోయే కోడలు వస్తూందని మంగళ తోరణం కట్టుకున్నామని—'' అంటూ ఆవు కన్ను పుచ్చుకుని సపోటా చెట్టు దగ్గరికి నడిచింది గౌరి

మంగళకు తొలిరోజు సాయంకాలం గౌరి చెప్పిన గాధ కళ్ళ ముందు మెదిలింది ఎవేవో తలచుకుని భయంతో ఆమె శరీర మొక్కసారి జలదరించింది చిన్నప్పటి నుండీ ఆశలు పెంచుకుంటూ, ఇక రాశి కట్టడమే తరువాయి అన్న తరుణంలో విధి వక్రించి గౌరి పెళ్ళి మరొకరితో జరిగింది కొంపతీసి తన జీవితంలో కూడా అలాంటి పరిస్థితి ఎదురవదుకదా' గౌరి కనక ఎలాగో తట్టుకుని మరొక జీవితాని కలవాటు పడిపోయిందేమో కాని తన కయితే ప్రాణాలు నిలవవు దేవుడా' అలా ఎన్నడూ జరగనివ్వకు ఛీ ఛీ ఇలాంటి ఆలోచన లొస్తున్నా యేమిటి తనకు? అలా యెప్పటికీ జరగదు. అని ఒకక్షణ కాలం భయపడుతూ, తిరిగి తనకు తానే నచ్చజెప్పుకుంటూన్న మంగళ ద్వారం దగ్గరే ఆగిపోవడం చూసి ''ఏం ఒంటరిగా లోనికి రాదలుచుకోలేదా'' అంటూ మళ్ళీ కవ్వించింది గౌరి

''ఇదుగో గౌరీ' నీకు మరీ అల్లరెక్కువవుతూంది. నిన్నేం చేస్తానో చూడు'' అంటూ వెంట తరిమింది మంగళ, గౌరిని పెరడంతా పరుగెత్తిస్తూ వాళ్ళిద్దరూ అలా పరుగెడుతూంటే, చప్పట్లు కొడుతూ నిల్చున్న కన్నని ఆపేక్షగా చూస్తూ, భవిష్యత్తులో ఇంకా ఎన్నెన్నో వేడుకలను, సంతోషాలనూ వూహించుకుంటూ తబ్బిబ్బయ్యాడు రామం

* * *

అసలే పల్లెటూరు అందులో అది మంగళ వ్యవహారం ఊరు వూరంతా గుబగుబలాడిపోయింది

పది గంటలవేళ జట్కా బండి దిగి పశుపతి రోసవిరొచ్చి వాకిట్లో తాడుమీద బట్టలారేసుకుంటూన్న మంగళను చూసి ఇంచుమించు ఏడుపు ముఖం పెట్టేసింది ''ఏమే మంగళా' నాన్నేదో తొందరపడి కసిరారే అనుకో, అంతమాత్రాన మేమంతా వచ్చామనుకున్నావా? నీ కా ఇంటితో ఏమీ సంబంధమే లేదనుకున్నావా?'' అంటూ ముఖం ఎర్రబారుచ్చుకుంది కందిపోయిన ముఖం, వణుకుతూన్న పెదవులు ఆమె బాధను ప్రస్ఫుటం చేస్తున్నాయి

''ఇంతకీ యిప్పుడేమయిందని,

వసూ?'' ఏమీ కానట్టే అడిగింది మంగళ.

''ఇంకా ఏం కావాలి? నాన్నే స్వయంగా వచ్చి నిన్ను పిల్చుకుపోదామను కుంటూంటే చెప్పాచెయ్యకుండా నువ్విలా వచ్చేయడం మంచిదేనా?'' చనువుగా సాధింపు ప్రారంభించిందా పిల్ల.

''నేనొచ్చి నాన్నకు క్షమాపణ చెప్పు కుంటాలే వసూ! ఏం చెయ్యమన్నావు చెప్పు? రామం బావ, గౌరి నన్నిక్కడ కట్టిపడేసారు. నేనూ కాదనలేకపోయాను'' మంగళ తల ఎత్తబోయేసరికి రుమాలుతో కళ్ళద్దుకుంటూంది వసుమతి

''పిచ్చిపిల్లా! పట్నంలో చదువులు వెలిగిస్తూ మరీ ఇంత చేలయితే ఎలా? ఛ ఛ కళ్ళు తుడుచుకో. గౌరి చూస్తే నవ్వగలదు. పట్నం దొరసాని పస ఇంతేనా? అని రామం బావ ఆటలు పట్టిస్తాడు,'' అని నవ్వుతూ మాటల్లో దింపేసి ఓదార్చింది మంగళ

''అయితే ఒక్క షరతు! నా చదువై పోయాక నువ్వూ నాతోపాటే ఉండాలి మరి ''

''అలాగే!'' అంది బుజ్జగింపుగా మంగళ.

''పోన్లే కానీ, ఇది చెప్పు నాన్నమీద నీకేం కోపం లేదుగా?''

''ఏమిటీ? ఆయన మీద నాకు కోపమా?'' వెంపలేసుకుంటున్నట్టే అడిగింది మంగళ.

''ఏమో, నిన్నింకేమీ అడిగి చికాకు పెట్టను, వెంటనే రమ్మనమని చెప్పేరు నాన్న నాతోనే పద'' అని చెయ్యి పుచ్చు కుంది వసుమతి

''ఆయన్ని బాధ పెట్టకు మంగళా! ఓసారి వెళ్ళి కనుపించిరా'' అని తను కూడా వసుమతి మాటను బలపరిచింది గౌరి

ఊళ్ళోవాళ్ళంతా మంగళ అప్పుల పాలై ఇల్లు పోగొట్టుకున్న వైనానికి రకరకాల ఊహాగానాలు చేసుకుని, ఎవరికి తోచిన రీతిని వారు తృప్తిపడ్డారు మంగళ ముఖం ముందు నిలదీసి అడిగే ధైర్యం పాపం మొత్తాన ఏ ఒకరిద్దరికో వున్నా చొరవ చేసి అడిగితే ఇదిరికే చెప్పని మంగళ మరొకరికి చెప్తుందా? కాలక్రమాన ఆ విషయం మరుగున పడిపోయింది

* * *

రాజు చివరిసారి హెచ్చరించిన దగ్గర్నుంచీ అట్టే తిరగడం మానుకున్నా లలితతో అప్పుడప్పుడు మురికిపేటలంట వెళ్ళడం, కృష్ణవేణిని కలియడం మాత్రం మానుకోలేకపోతూంది మంగళ. చిన్నతనంలో సర్వమంగళాదేవి గుడి ముందు ఆడుకునే జట్టులో కృష్ణవేణి కూడా ఉండేది

'అప్పుడే కృష్ణని కలిసి చాలా రోజులయింది ఓసారి చూసివస్తాన'ని బయలు దేరింది మంగళ ఆ వాడకు రావడమంటే నిజంగా మంగళకు కూడా కిట్టదు కాని బురదలో పద్మంలా పుట్టిన కృష్ణవేణి కోసం రాక తప్పదు

వీధి తలుపులు వారగా తెరచి వున్నాయి గుమ్మానికి రంగుల పూసల తెరలు వేలాడుతున్నాయి



ప్రక్కగా నక్కి పూసల తెరగుండా పెద్ద గదిలోకి కొంచెం తొంగి చూసింది మంగళ. కృష్ణ తల్లి మాణిక్యం కారా కిల్లీ నములుతూ ఓ వాలు కుర్చీలో కూర్చొని ఉంది. తబలా ముందేసుకుని 'గుప్ గుప్' మనిపిస్తూంది జీవరత్నం. గుడికి మేక పోతుని తోస్తున్నట్లుగా, నాట్యం చెయ్య డానికి సిద్ధపడుతూంది కృష్ణ.

"ఇప్పుడైనా దృష్టి కాస్త తాళం మీదుంచి అడుగులెయ్యేపిల్లా" తబలా ముందున్న ముసలిఘటం పాతికేళ్ళ పడుచులా బింకంగా కూచుని మొగాడి తీరు నభినయిస్తూ వాయిద్యం ప్రారం భించింది.

'ధా దిం ధిం ధా, దా ధిం ధిం ధా, ధా తిం తింతా, తా ధిం దిం దా "తాళం సమాని కొచ్చేసరికల్లా ఆమె నోరు పెద్ద కప్పలా తెరుచుకుంటూంది. ఎంత ఏహ్యాభావనతో, అన్యమనస్కంగా అభినయిస్తున్నా నాట్యం చేస్తూన్న కృష్ణ బొమ్మలా వుంది మెచ్చు కోలుగా కళ్ళింతింత చేసుకుని చూస్తూంది మంగళ.

వాయిద్యం పైకాలాన్నందుకుంది అలసటగా, చిరాకుగా ఆడుతూనే వుంది కృష్ణ 'క్రాంధా, క్రాంధా, క్రాంధా' అంటూ గారపళ్ళు బయటపెట్టి నోరు సాగదీసుకుని ముక్తాయి కొట్టిన ముసిల్ది, ఆడకుండా చతికిలబడిపోయిన కృష్ణవేణిని చూసి నెత్తి మొత్తుకుంది

"మాణిక్యం! నీ కూతురసలు బాగు పడుద్దా? ఏటిలా పెంచి తయారు చేసావు? వందలు వందలమంది పిల్లల్ని తయారు చేసిన ఈ జీవరత్నానికే లొంగకుండా వుండే యీ పిల్ల, ఇక నీకేటినుద్దిలే! అయినా బాగుపడే గీత లేనోళ్ళని ఎవరు బాగుచెయ్యగల్రు?" జీవరత్నం కోపంగా గెంతులెయ్యడ మారంభించింది

"అయినా జీవరత్నం, నీ ముందు కృష్ణ ఏమాడుతుంది పోదూ! నువ్వు కోపంలో గెంతినా నాట్యం చేస్తున్నట్టే ఉంటుంది అసలు ముసలిదానివని అని పించనే అనిపించదు" అనుకుంటూ తెర తొలగించుకుని ప్రవేశించింది మంగళ. మెచ్చుకుంటే చాలు పడి చస్తుంది జీవ రత్నం

ఎప్పుడో అరవై యేళ్ళ కిందట ఉత్తరహిందూస్థానంలో ఏ జమీందారుకో ఉంపుడుకత్తెగా ఉండి, వృత్తిని నిరా ఘాటంగా సాగించి, తన ఆటా పాటతో తనంతది లేదన్న పేరుతోపాటు అంతకు మించిన ఆస్థిపాస్తులను సంపాదించుకున్న ఒకనాటి జీవరత్నం ఈనాడు జీవచ్ఛవం. ఆ వృత్తియెడల ఆమెకుగల అనురాగం ఇంతింతని చెప్పలేనిది పాడురోజులొచ్చి తమలాంటివాళ్ళ నోటి ముందు కూడు తన్నుకుపోయిందని ఎప్పటికైనా తిరిగి ఆ రోజులు మళ్ళీ రాకపోతాయా అని ఎదురు చూసే ఆశాజీవి కూడానూ

'కులవిద్యకు సాటిరాదు' అంటుంది. ఎక్కడో మారుమూల పట్నంలో రహస్య గృహాలు నడిపి నడిపి చివరికి వృత్తి సాగక, వార్ధక్యం పైపడటంతో మాణి క్యాన్ని కూతురి వరస చేసుకుని, తన అంత్య దినాలు గడుపుకుందుకి కొద్దిరోజులి కిందటే ఆ వూరు చేరుకుంది జీవరత్నం

కృష్ణవేణిలాంటి అందాల బొమ్మ కన



బడగానే ఆమెలో మళ్ళీ ఏవో ఆశలు చిగురించాయి 'మాణిక్యం' నీకు పిల్లని దారిలో పెట్టడం చేతకాకపోతే నోర్మూసుకునుందు-దాన్ని బాగుచేసే పూచీ నాది' అని ఎవరూ ఇవ్వక్కర్లేకుండా కృష్ణపై సర్వహక్కులూ స్వయంగా లాక్కుని, ఆ పిల్లని నానాతిప్పలూ పెట్టడం ప్రారంభించింది. తన అసమర్థతకు సిగ్గు పడుతూన్న మాణిక్యం జీవరత్నం ఛాటికి జడిసి "నీదే భారం పిన్నమ్మా" అంది.

ఏభై రూపాయల ముష్టి డబ్బు కోసం తనను అమ్మేసుకున్న తన తల్లితండ్రులు ఎంత దరిద్రులో, ఎంత నీచులో అని కుమిలిపోతూ నరక కూపంలో జీవితం వెళ్ళబుచ్చుతున్న కృష్ణ, చౌదరిగారి పుత్ర రత్నం గోవిందు మీద అన్ని ఆశలూ పెట్టుకుని, ఎంతట విదేశాల్నుంచి వస్తాడా, ఈ ఛిద్రంలోంచి తనకు విముక్తి కలిగిస్తాడా అని చంద్రుని కోసం చకోరంలా ఎదురు చూస్తూంది

"మీరూ, మీ నాట్యం గంగలో కలవండి, ఇక ఈ తైతక్కలాడటం నావల్ల గాదు" అంటూ విసురుగా కాళ్ళనున్న గజ్జలు విప్పి దూరంగా కూచున్న మాణిక్యం కాళ్ళ దగ్గర పడేలా విసిరి ఛర్రున కర్టెను తొలగించుకుని లోపలికి వెళ్ళిపోయింది కృష్ణ

"అవ్వ అవ్వ ఏం పెడసరమే" అని బుగ్గలు నొక్కుకుంది జీవరత్నం.

"చూసేవమ్మా, నీ స్నేహితురాలి ఆగడం' ఇలాగయితే మా బతుకు లెలా గడుస్తాయో చెప్పు" దీనంగా మంగళ కేసి చూసింది మాణిక్యం.

"గజ్జెలు నేలకి విసిరి కొడుతుందా, పోయేకాలం కాకపోతే-" ఇంకా కసిగా పళ్ళు కొరుకుతూనే ఉంది ముసల్ది.

'నేలకొట్టింది కాని నీ ముఖంమీద కొట్టవలసింది' అని లోపల కక్షగా అను



కుంటూ, ''అవునవును. తప్పుకాదూ పోయేకాలమే మరి.'' అంది 'పోయే కాలం' అన్నచోట తమాషాగా విరిచి, సాంత్వనవచనాలు పలికింది మంగళ

''చూడమ్మా' నువ్వు కష్టం, సుఖం తెలిసిన పిల్లలా ఉన్నావ్ కుమ్మరోళ్లు కుండలు చెయ్యడంలే◦ మేదరోళ్లు తట్ట లల్లడంలే◦ ఎవళ్ల రుత్తి ఆళ్లు సేసుకుంటే తప్పేం◦ ఏదో ఈ పిల్ల గడించిపోస్తాదని ఆశరెట్టుకున్న మా మాణిక్యం మసైపోవాలని గాపోతే, ఈః పిల్లకిలాంటి బుద్ధు లెందుకొస్తాయ్◦ నువ్వైనా బోదపరచమ్మా తల్లి తల్లీ'' ముసలి సానిది జాలిగొలిపే దీనంగా చెపుతూంటే, 'అయ్యొయ్యో! ఎంతమాట అంతే అంతే'' అంటూ విన్న మంగళ ''ఎందుకు బోధపరచనూ?'' అంటూ వాళ్లిద్దరినీ తప్పించుకుని కృష్ణ ఉన్న గదిలోకొచ్చి పిశాచాయి వదలినట్టుగా నిట్టూర్చి మంచంకేసి చూసింది

మంగళను కూర్చోమంటూ, కృష్ణవేణి లేచి కళ్లు తుడుచుకుంది. కృష్ణ, గోవిందు మధ్య ప్రేమవ్యవహారం మంగళకు ఆది నుంచీ తెలుసు. సంవత్సరం ముందు హఠాత్తుగా విదేశాలకు పయనమైన గోవిందు తిరిగొచ్చాక, ఈ ప్రపంచా న్నంతా ఎదిరించయినా సరే కృష్ణనే పెళ్ళి చేసుకుంటానని మాటిచ్చి మరీ వెళ్లేడు

''ఊరుకో కృష్ణా' చూడప్పుడే సంవత్సరం గడచిపోయింది. మరొక్క సంవత్సరం కళ్లు మూసుకుంటే గోవిందొచ్చేస్తాడు. నీ కలలన్నీ నిజమైపోరాయి రోజురోజుకీ ఇలా ధైర్యం పోగొట్టుకుని ఏడుస్తూ కూచుంటే ఎలా◦ స్థాన బల వాళ్ళది' అందుకే ఎలాగో ఆ పిశాచాల్నే మచ్చిక చేసుకుని, రోజులు దొర్లించేసి కార్యవాదివనిపించుకోవాలి. ఇప్పు[illegible] మాత్రం నువ్వు తిరుగుబాటు చేసి[illegible] మరింత చెడుతుంది వ్యవహారం అవునా◦'' బుజ్జగింపుగా అడిగింది మంగళ

''నా వల్ల కావడంలేదు మంగళా రోజురోజుకీ నా ధైర్యం సన్నగిపోతూంది ఆటా, పాటా నేర్చుకుంది నే నేడుస్తూంటే, మూలిగే నక్కమీ తాటిపండులా ఈ మునసబు ఒంగినా మొకడు దాపరించాడు పిశాచంలా [illegible] ప్రాణానికి. నా బ్రతుకు రోజురోజుక[illegible] హీనమైపోతూంది. గత్యంతరంలే ఎప్పుడో ఒకనాడు బలవంతాన ప్రాణా[illegible] తీసుకోవలసి వస్తుందేమో'' ఖిన్నవ[illegible]నంతో కృష్ణవేణి తన గోడు చెప్పుకుంట ఆశ్చర్యంగా చూస్తూ, ''ఏమిటీ◦ [illegible] నాధమా◦'' అంది మంగళ.

''కొంపతీసి పెళ్లాడతానంటాడేమిటి?

''పెళ్లేమిటి వాడి ముఖానికి, అరవయే యేట అగ్గి గండమని' నేను 'ఊ' అంటే నన్ను బంగారు మరాహా చేస్తాడట ఇల్లంతా ఇంద్రభవనం చేసే[illegible]డట. మూడో కంటివాడికి మాత్రం [illegible] వ్యవహారం తెలియనివ్వకూడదని - నే[illegible] కోపగించుకుని, అసహ్యించుకుని, తి[illegible]తున్నా వదలకుండా శనిగ్రహంలా ప[illegible]కుని వాగివాగి పోయాడు వాడు [illegible] చూపిస్తూన్న డబ్బుమీద ఆశకొద్దీ

ముసిలిదెయ్యాలు రెండూ నన్నా రొంపిలో దింపాలని విశ్వప్రయత్నం చేస్తున్నాయి మంగళా! ఎందుకు చెప్పు నాకీ నికృష్ట జీవితం? ఇంతకంటే చావు మేలు కాదూ?'' బేలగా గుడ్లనీళ్లు కుక్కుకుంటూ చెప్తున్న కృష్ణ భుజం ధైర్యంగా తట్టింది మంగళ.

''కృష్ణా! నువ్వు నిశ్చింతగా ఉండు. ఇంతకీ ఇప్పుడీ రగడకంతా కారణం రంగనాథమేగా? వాడి సంగతి నే చూస్తాలే మళ్ళీ మీ ఇంటి చాయలకు కూడా రాడు, వాడు సరేనా?'' అంది బింకంగా

''అమ్మో! ఏం చేస్తావేమిటి? వాడసలే కిరాతకుడు. మూడో కంటివాడికి తెలియ నివ్వద్దని ముందే హెచ్చరించాడు ఏం చేసినా చెయ్యగలడు.'' భయంగా మంగళ చేతులు పట్టుకుంది కృష్ణ.

''ఏం చేస్తాడు వాడి ముఖం! ఏమీ చెయ్యలేడు చూడు కృష్ణా! కిరాతకుడయేది, దేవాంతకుడయేది ప్రతి వాడికీ ఎక్కడో చిన్న లొసుగుంటుంది, ఆ లొసుగు కనిపెట్టి వాళ్ల వేలితో వాళ్ల కన్ను పొడుచుకునేలా చెయ్యడమే ఈ సర్వమంగళాదేవి ప్రజ్ఞ నువ్వేమీ ఎరగనట్టే హాయిగా ఉండు. ప్రస్తుతానికీ ముసిలిముండలతో జట్టీ పెట్టుకోకుండా ఆటో, పాటో నేర్చుకుంటున్నట్టు గమ్మత్తు చెయ్యి. మిగిలిన సంగతి అటునుంచి నరుక్కొద్దాం. నేనుండగా నీకేమీ భయం లేదు. గోవిందు వెళ్ళిపోతున్నప్పుడు, నా మీద ఎంత భరోసా లేకపోతే నిన్ను నా కప్పగించాడనుకున్నావు '' అంటూ చక్కిలిగిలి చేస్తూంటే తన వేదనంతా మరచిపోయి, దూదిపింజలా తేలికపడ్డ మనసుతో, హాయిగా మంగళలో శ్రుతి కలిపి నవ్వింది కృష్ణ

ఎవరో వస్తున్న అలికిడవుతూంటే కంఠం సర్దుకుంది మంగళ ''నీ వాళకం ఏం బాగలేదు కృష్ణా! జీవరత్నంలాంటి గురువెక్కడ దొరుకుతుంది చెప్పు నీకు? వాళ్లు చెప్పినట్టు మసలుకుంటే బాగుపడతావు నీ స్నేహితురాలిగా ఇంతకంటే ఏం చెప్పగలను?'' కృష్ణ తలొంచుకుని ముసిముసిగా నవ్వుకుంది.

''చిన్న పిల్లవైనా దొడ్డ బుద్ధెమ్మా నీది!'' అని మెచ్చుకుంది మాణిక్యం.

''నువ్వేం బెంగపడకు మాణిక్యం! మన కృష్ణ కాలిగజ్జెలు ఘల్లుమనిపించిందంటే కాసులు జలజల రాలి పడాల్సిందే. ఇక బుద్ధిగా నేర్చుకుంటుందిలే నాట్యం. అలా అలా చివరికేమవుతుందో నువ్వే చూద్దుగాని!'' అని కృష్ణకు చిన్నగా కన్ను గీటి వీధిలోకి తుర్రుమంది

* * *

రచ్చబండనుండి ఇంటి దారి పట్టే రంగనాథంకోసం, అట్టే జనసంచారం లేనిచోట, సందె చీకటివేళ రెండు కళ్లు 'చమక్-చమక్'మంటున్నాయి. పరధ్యానంగా నడుస్తూన్న రంగనాథం ''మామయ్యా!'' అన్న కేకకి జడుసుకోబోయి, ఎదురుగా మంగళని చూసి ధైర్యం పుంజుకుని, ''నువ్వాటే కొంటెపిల్లా! ఈ వేళప్పుడేం చేస్తున్నావిక్కడ?'' అన్నాడు



'మళ్ళీ ఏం తెస్తావేమిటి నా కొంప మీదికి' అన్నట్టున్నాయతని చూపులు.

"ఏం మామయ్యా? కోడలుపిల్లా అనడం మానేసి, కొంపెపిల్లా అంటు న్నావు, మొన్ననేదో సరదాకి అలా అంటే భయపడలేదు కదా?"

"నాకు భయమేమిటే వెర్రిదానా? నీ అల్లరి, ఇంతప్పట్నుంచి నాకు తెలవదూ?" గడుసుగా మాట్లాడేననుకున్నాడు రంగ నాధం

"ఆఁ అన్నట్టు అల్లరంటే జ్ఞాపకం వచ్చింది కానీ-ఈ మధ్యేదో నిన్న అల్లరి జరిగి సుబ్బన్న బావ పెద్ద ఇబ్బందిలో పడ్డాడని విన్నాను - ఏమిటో పాపం, ప్చ్- నిజమేనా మామయ్యా?" సానుభూతి వలకబోస్తూ మంగళ అలా అడగబోయే సరికి రంగనాథానికి గుండెలో రాయి పడ్డట్టయింది.

ఇన్నాళ్లుగా ఆ సంగతి తన దగ్గర ఎత్తకపోవడంచేత ఈ రసాభాసంతా మంగళవరకూ వెళ్లి ఉండదని ఈ మధ్యనే ధైర్యపడటం ప్రారంభించాడు. కళ్లనీళ్లు తరువాయిగా రంగనాథానికి ఏడుపుముఖం పడిపోవడం ఓరకంట మంగళ గమ నిస్తూనే ఉంది

"అయినా ఎమిటో పాపం! సుబ్బన్నే వట్టి వెర్రి నాగన్న అనుకుంటే నువ్వు కూడా ఇంత అమాయకుడవనుకోలేదు మామయ్యా! నీ అమాయకత్వం చూసి కాకపోతే, ఆ జాణ ఎవతో నిన్ను ముప్ప తిప్పలు పెట్టి, మూడు చెరువుల నీళ్లు తాగించి, నీ ముక్కు పిండి, నీ దగ్గర మూడువేలు గుంజుకుంటుందా?"

దేనికి నాందీగా మంగళ ఇప్పుడీ ప్రస్తావన తెస్తూందోనని ఓ పక్క హడలి చస్తూనే, "ఖర్మమ్మా-వాడి మెత్తదనం. ఏం చెయ్యమంటావు అదే నీతో చెప్పా లనుకుంటూన్నదసలు. ఇంతకీ ఈ పాడు గోల నీ చెవివరకూ " ఉత్కంఠ నాపుకోలేక అర్ధోక్తిలో ఆగేడు.

"పిచ్చి మామయ్యా! మూడో కంటి వాడి ముఖ్య గూఢచారినని నువ్వే ఎవరి తోనో అన్నావటగా! గాలి చెప్తుంది - ధూళి చెప్తుంది - గగనంలో ఎగిరే గరుడ పక్షి చెప్తుంది - అదంతా అనవసరం కానీ, నీకు జరిగిన అన్యాయానికి నాకు చాలా బాధగా మాత్రం ఉంది మామయ్యా!"

కొరకరాని కొయ్యలాంటి మంగళ తన కొంపమీదికేం తెచ్చిపెట్టబోతూందో నని బెంబేలెత్తిపోతూ 'వసుదేవు డంతటి వాడు' అని లోలోన స్మరించుకుని, దీనంగా మంగళ రెండు చేతులూ పట్టు కున్నాడు రంగనాధం

"మంగళా, చూడమ్మా! ఏదో గ్రహ చారంకొద్దీ, మన సుబ్బిగాడి తెలివితక్కువ కొద్దీ ఈ అనర్థం జరిగింది పొన్నవలస పిల్ల జమీందారు ఏభై వేల కట్నంతో పిల్ల నిస్తామని మొన్ననే కబురుపెట్టేడు ఇప్పుడీ విషయం బైటకు పొక్కిందంటే తలెత్తుకోలేని అప్రతిష్ఠతోపాటు "

"వాకిలివరకూ వచ్చిన స్వర్గం వెనక్కి పోతుంది. నాకు తెలుసు మామయ్యా!" మెల్లగా పెదవి కొరుక్కుని పూర్తి చేసింది మంగళ.

"అయినా నీ అమాయకత్వాన్ని అను



ృగా తీసుకుని, నీకు పట్టబోతూన్న
ృదృష్టానికి అసూయపడి, నిన్ను సర్వ
ాశనం చెయ్యదలచుకున్న ముసిలినక్కలు
ీవరత్నం, మాణిక్యంలాంటివాళ్ల దౌర్జ
న్యాలు తెలిసి, నీ అమాయికత్వానికి బాధని
ంచి, నీతో ఏదో అన్నానేకాని, ఎక్క
ైనా ఎందుకంటాను మామయ్యా''

జీవరత్నం, మాణిక్యం పేర్లు వినపడే
రికి రంగనాథం ముఖం మసిబొగ్గులా
ాడిపోయింది. నోట మాట రాలేదు.
'ఆఁ ఆఁ అదేమిటది'' కొంత
ుపటికి నత్తినత్తిగా ఏదో గొణిగినట్టడి
డు.

''లేకపోతే ఏమిటి మామయ్యా,
ాపం - ఏదో ఎరిగున్నవాళ్లు గదాని
మారెళ్లి పలకరించి ఉంటావు - ఆ కృష్ణ
ణిని నీకెరచూపించి క్రమంగా దాని
ల్లోవేసుకుని, నీ కొంప గుల్లచేసి, నీకూ,
కొడుక్కీ చిప్ప చేతికిచ్చెయ్యాలని
చూస్తూందా మాణిక్యం నువ్వింకా పెరటి
తోవనున్నావేమో' అటున్న సూర్యుడిటు
తిరగబడ్డా కృష్ణ నీకు లొంగడం మాత్రం
కల్ల!'' లోలోపలణచిపెట్టుకుంటూన్న
కోపానికి మంగళ పిడికిళ్లు బిగుసు
కున్నాయి.

''అయ్యయ్యో, దేవుడా! ఏమిటీ
ఘోరం - ఆ బొడ్డూడని పిల్ల కృష్ణవేణి
వయసెక్కడ, నా వయసెక్కడ—
ఆఁ '' కంగారెత్తిపోతూ చెమటలు
కక్కుకుంటూ, ఎగఊపిరి తీసుకుంటూ
అన్నాడు రంగనాథం.

''అందుకే మామయ్యా, నిన్ను ఉత్త
అమాయకుడివంటాను - ఎంతెంత
ఘోరాలు జరిగిపోతున్నాయో నీ కేమీ
తెలియడంలేదు. కొంపతీసి నువ్వా
మాణిక్యం పాలబడతావేమోనని హడలి
చస్తున్నాను మామయ్యా!''

బేలలా చిలకలా పడుతూన్న మంగళకి



ఆమూలాగ్రంగా అంతా తెలిసిపోయిందని రంగ నాధాని కప్పటికే బోధ పడింది. నటన వ్యర్ధమని తెలిసి కూడా నటించక తప్పని ప్రాణసంకటం వచ్చిపడింది. నిర్లక్ష్యంగా ఎటో చూస్తూంది మంగళ.

"అలాగా! ఛ ఛ ఈసారి మళ్ళీ ఆ గడప తొక్కుతానా, వాళ్ళింత కుత్సితం చేస్తున్నారని తెలిసాక." చీదరించుకుంటు న్నట్టు, అసహ్యపడుతున్నట్లు వీలయినం తగా ముఖం మార్చుకున్నాడు రంగ నాధం.

"గడప తొక్కడం కాదు-కన్నెత్తి చూడకూడదు కూడా!" శాంతిస్తున్న ట్టుగా అంటూన్న మంగళ 'మింగేస్తాను చూస్కో' అని నోరు తెరుచుకుని మీద పడబోతూన్న అమ్మవారిలా కనుపించి, ఇంతలావు రంగనాథం బిక్కచచ్చి పోయాడు.

"పొరపాటునైనా మళ్ళీ అటు వెళ్ళావో మన సుబ్బమ్మ పెళ్ళి " రంగనాధానికి అప్పటికి మంగళ ధోరణి పూర్తిగా అర్ధమయి కాళ్ళు చేతులూ చల్ల బడిపోయాయి.

"సుబ్బన్న పెళ్ళి ?" దిష్టిబొమ్మలా నోరు తెరుచుకుని నిలబడ్డాడు.

"రసాభాసయిపోతుంది మామయ్యా" మళ్ళీ కొంచెం దువ్వడం ప్రారంభించింది మంగళ. "ఆ తండ్రీ కొడుకు లిద్దరూ వట్టి జులాయికోర్లు ముండల మురాకోర్లు అని పేరొచ్చేస్తుంది తాటి చెట్టుకింద పాలు తాగినా కల్లే అంటారు-నీకు నేను చెప్పాలా మామయ్యా-ఇలా అన్నాననేమీ అనుకోకుమీ" అంది ఆత్మీయలగా

బుద్ధి గడ్డితిని, వినాశకాలం దాపురించి కృష్ణవేణి కోసం వెళ్ళేనని మనసులోనే లెంపలేసుకున్నాడు రంగనాధం. ఇంకా భయం చావక, "చూడమ్మా చిన్నదాని వయినా మంచి మాట చెప్పేవు. తప్పు లేదు. ఏళ్ళొచ్చినా నీపాటి తెలివితేటల్లేవు నాకు. ఇక ఛస్తే ఆ వాడ వైపే వెళ్ళను కాని, సుబ్బడి పెళ్ళయేవరకు ఎవరూ నా కొంప ముంచకుండా ఉంటే అదే చాలు" అన్నాడు-"నువ్వు" అన్న ముక్క పైకి అనలేక.

"ఏం భయపడకు మామయ్యా! ఆ పిల్లకు మనవాడే పెనిమిటయే యోగం ఉంటే జరిగితీరుతుంది," అంది లోపల "ఖర్మ" అనే మంగళ ఉద్దేశ్యం.

"తల్లి తల్లీ, నీ నోటి వాక్యాన అలాగే జరగాలి, బంగారు కొండా నీ ఇల్లు వెయ్యిళ్ళ మొదలవాలికనీ, వస్తా మరి, చీకటడిపోతూంది ఆడదిక్కులేని కొంపకూడా నాయె!" పంచ హడావిడిగా పైకెత్తుకుని కదిలాడు రంగనాధం

"నే చెప్పింది గుర్తుంచుకో మామయ్యా, మనకి సుబ్బన్న సంగతి ముఖ్యం!" దూరమైపోతూన్న రంగ నాధానికి మరో కేక పెట్టింది మంగళ

చివరికెన్ని తిప్పలు పడ్డా వాకిలి దగ్గర స్వర్గం వెనుతిరిగేపోయింది. పొన్నవలస పిల్ల జమీందారు నిర్మొహమాటంగా 'మాకు నచ్చలేదు' అని ముఖం బద్దలు కొట్టి నట్టుగా చెప్పేసరికి ఈ మంగళ మహాతల్లి

లోపాయికారిగా నడిపిన తంత్రమయి ఉంటుందని ఉడికుడికి చావటం మొదలెట్టేడు రంగనాథం.

అయితే సుబ్బారావు చదువుతూన్న మెడికల్ కాలేజీ మేనేజింగ్ కమిటీ చైర్మన్ ఆపిల్ల జమీందారు తోడల్లుడేననీ అతగాడే ఈ కథను వాళ్ళకు మోసేసి ఉంటాడని నసుగుతూ, సిగ్గుపడుతూ, చావు కబురు చల్లగా, సుబ్బారావే తండ్రి చెవిన వెయ్యటంతో, మంగళతత్వమేమిటో అర్ధంకాక తికమకపడుతూనే, "ఇకనైనా తెలివిగా మసులుకోరా గాడిదా!" అని కసిరి పంపించేశాడు

ఇంతగా పడిచచ్చిన రంగనాథం తిరిగి ఎందుకు గడపతొక్కలేదా అని కిందా, మీదా పడుతూన్న జీవరత్నం, మాణిక్యాన్ని ఓ చల్లని వేళ, ఓ వారగా పిలిచింది మంగళ "మీరుత్త అమాయకులు-రంగనాథానికి వేలువిడిచిన బావమరది పట్నంలో పోలీసు సబిన్స్పెక్టరు. మీకు డబ్బు ఎర చూపించి, మిమ్మల్ని వీధిలోకీడ్చి, మీరు వేశ్యావృత్తి చేస్తున్నారని కేసు బనాయించి, మిమ్మల్ని శ్రీకృష్ణ జన్మస్థానానికి పంపాలని రంగనాథం కుయుక్తి పన్నాడంతే అయినా మీకేం ఫరవాలేదు - వాడి సంగతి నే చూసుకుంటాను - మీరుమటుకు ఇక పైవాడిని గడప తొక్కనివ్వకండ"ని ఆప్యాయతగా చెప్పింది.

"ఈడి కడుపునో పుండుపుట్ట!" మెటికలు విరిచింది జీవరత్నం.

"నా తల్లి! నీ మేలు మరిచిపోవమ్మా!" అని, అంతతో ఇంకేమి అనర్ధం జరగనందుకు మాణిక్యం సంతోషపడుతూంటే, మంగళ చాతుర్యానికి అబ్బురపడుతూ ఓ ప్రక్క కృష్ణవేణి చెయ్యెత్తి దండం పెట్టుకుంటూంటే "జై మంగళా!" అంటూ, కాలి మువ్వల పట్టీలు ఘల్లుఘల్లుమనిపించుకుంటూ సర్వమంగళాదేవి ఆలయంకేసి పరుగుతీసింది మంగళ

## 5

సంవత్సరానికోసారి వచ్చే పండుగలే ప్రాణాంతకంగా ఉంటాయి పట్నవాసులకి. పల్లెజనానికెన్ని పండగలొచ్చినా సందడే-వాటితోపాటు పొట్టేళ్ళ పందేలూ, కోడిపందేలూ, సంతలూ-వీటితో దినానికో వేడుక వాళ్ళకి.

ఆదివారం పొరుగూరు సంత అంటే ఊరి ఊరెడు జనం వెళ్ళిపోతారు దానికి. పశువుల నాడెంలో మంచి ప్రజ్ఞకలవాడని రామానికి పేరుంది ఎవరో ఒకరొచ్చి 'సువ్వు రావాలి రామయ్యా!' అంటారు. కన్నగాడిని వెంటబెట్టుకుని తప్పనిసరిగా తయారైపోతుంది మంగళ గౌరికలాంటి సరదాల్లేవు. ఎప్పుడూ గడప కదలదు.

అయితే ఆ ఆదివారం మాత్రం మంగళ సావాసకత్తెలంతా ఊడిపడి సంతకెళ్ళనివ్వకుండా చేసేసారు. మగాళ్ళంతా ఊర ఉదయాననగా పోతే, సందెవేళక్కాని తిరిగిరారు. అంతవరకూ ఇష్టమొచ్చినట్టు గెంతి ఆడిపాడి నిర్భయంగా చెరువులోఈత కొట్టవచ్చు - మామూలు రోజుల్లో



అయితే అలా వీలుపడదు. ఈతంటే మంగళకి మహా సంతోషం. ఎలాగైతేనేం సంతకెళ్లే ప్రయత్నం విరమించుకుని - సత్తరకాయిలా వెంట తిరిగే కన్నని మంచి మాటలాడి రామంతో పంపేసి, జట్టువాళ్ళతో కలిసి నవ్వుకుంటూ, గెంతు కుంటూ చెరువుకేసి సాగిపోయింది మూడు మున్కా పడితేగాని ఆకతాయితనం వదలదనుకుంటుంది గౌరి

రెండు ఝాముల వేళవరకూ ఇచ్చానుసారంగా తిరిగి, చెరువులో ఈదులాడి, ఆ తడిబట్టలతోనే బయలుదేరి, పుల్లేరి పళ్లు, బలుసుపళ్లు, అల్లిపళ్లు వీలయినన్ని ఏరుకుతిని, సరదాగా ఎక్కడివాళ్లక్కడ విడిపోయారు. మంగళ కూనిరాగాలు తీసుకుంటూ ఒంటరిగా ఇంటికేసి నడక సాగించింది వీధి మొదల్లో రామాలయం ముందు హఠాత్తుగా ఆమె కాళ్లాగిపోయాయి

ఎన్నడూలేని వింత ఓ అందమైన కారు నిలచి ఉందక్కడ. చిన్న, పెద్ద అంతా దాని చుట్టూ చేరి వింతగా చూస్తున్నారు. సరదానాపుకోలేక మంగళ కూడా దగ్గరగా వెళ్లి, ఓ సారి చెయ్యేసి తడిమి చూసింది నున్నగా నిగనిగలాడుతూ ముద్దొస్తూంది కారు. "ఎవరిదీ" అని జనాంతికంగా అడిగింది. ఎవళ్ళ వూహాగానాల్లో మునిగి తేల్తూన్న వాళ్ళు తెలియదన్నారు.

వెంటనే మంగళ ఊహా ప్రపంచంలోకి జొరబడింది. అది రాజు కారుట - అంటే తనది కూడా! రాజు ప్రక్కన కూర్చుని అతని భుజం మీద తలవాల్చి కబుర్లు చెప్పుకుంటూ, అలా గాలిలో తేలిపోతూన్నట్టు పగటికల కని 'ప్చ్' "రాజుకిలాంటి కారుండాలి నిజంగా!" అనుకుంది, కారుని వదలి విధిలేక ఇంటికేసి నడుస్తూ

గుమ్మంలో అడుగు పెట్టబోతుంటే మంగళకు లోనుంచేదో అపరిచితమైన పురుషకంఠం విన్పించింది ఆశ్చర్య పోతూ, పెరటి తోవగుండా వెళ్ళి కిటికీ వార పొంచి మెల్లగా తలెత్తి చూసింది. సూటూ బూటూతో దర్జాగా రాజసం ఒలుకుతూన్న గంభీర విగ్రహం మెవరో తెలియలేదు కాని 'రాజుమాత్రం ఇతనికేం తీసిపోయాడు?' అనుకుంది అంతలోనే లోనుంచి కొన్ని మాటలు చెవుల పడుతూంటే ఆశ్చర్యంగా వింటూ ఉండిపోయింది

గౌరి చేతిలో ఏదో కాగితం రెపరెపలాడుతూంది ఎదురుగా ఉన్న వ్యక్తి ముఖంలో క్రమ క్రమంగా దీనత్వం చోటు చేసుకుంటూంది.

"గౌరీ, నన్నింకా నమ్మలేకపోతున్నావా?"

మంగళ ఆ వ్యక్తి ఎవరో కొద్దిగా పోల్చుకోగలుగుతూంది. అది నిజమని రుజువయింది.

"నమ్మి, నమ్మక నేనిక చెయ్యగలిగేదేం లేదు మురళీ, నేను నిన్ను కోరేదల్లా ఒక్కటే. నువ్వు తక్షణం ఇక్కడ్నుంచి వెళ్ళిపో. నన్ను మరచిపోవడానికి ప్రయత్నించు నాకు పెళ్ళయింది. ఓ కొడుకున్నాడు. నా ఆవేదనని గుండెలో చెలరేగే ప్రళయాన్ని అర్థం చేసుకోలేక




పోయినా, అపనిందలు మోపి అభాసుపాలు చేసి, కుళ్ళి కుళ్ళి ఏడుస్తూంటే చూసి సంతోషించే సమాజం కూడా వుంది. అందులో ఇది పల్లెటూరు. నా బ్రతుకీ మాత్రంగా నేనా వెళ్ళమారిపోవాలంటే నేను నిజంగా చచ్చిపోయానే అనుకుని మరి ఈ గడప తొక్కకు.'' గద్గద స్వరంతో చెప్తూంది గౌరి.

''ఈ మాట నువ్వే అనగలుగుతున్నావా, గౌరీ!''

''ఆహా నేనే గౌరినే కాని ఒకనాటి గౌరిని కాను-ఈనాడు నేనొక బండరాయిని. వెళ్ళిపో మురళిబాబూ-వెళ్ళిపో'' ఆవేశంగా అరచినంత పని చేసింది గౌరి.

''అలాగే. నా ఉనికి నీకు బాధ కలిగిస్తూంటే తప్పక వెళ్తాను కాని, ఒక్క సంగతి మాత్రం గుర్తుంచుకో-సమాజం, సమాజం అంటున్నావే, ఇలాంటి పాపిష్టి సమాజానికి జడిసే ఐదేళ్ళ కిందట నా చేతుల్తో నా గొంతు నొక్కుకుని భ్రష్టుడినయ్యాను. ఈ ఐదేళ్ళలోనే నీ సమాజాన్ని చాలా పరికించాను గౌరీ! ఒదిగి ఒదిగి ఉంటున్నవాడికి కమ్చీ దెబ్బలు తప్పవు. కత్తితో ఒక్క వేటు వేసేసి తన దారి తాను చూసుకోగలిగినవాడికి మంగళహారతులు నిన్ను చూడకుండా ఉండలేననిపించిననాడు వచ్చి తీరతాను మళ్ళీ. ఆ రోజు నీకు కష్టమనిపిస్తే తిట్టు, కొట్టు, చంపెయ్. అంతేకాని సమాజం పేరు మాత్రం ఎత్తకు.''

ఆ మాటలు వింటూనే రెండు చేతులా ముఖం కప్పుకుని గోడకి చారబడిపోయింది గౌరి. అతను బాధగా పెదవులు బిగబట్టి గడపవరకూ మెల్లగా నాలుగడుగులు వేసి, రుమాలుతో ముఖం



అద్దుకుని అంతలో అంగ లేస్తూ చరచరా బయటకు సాగిపోయాడు.

గౌరి కళ్ళు తెరిచిచూసే సరికి ఎదురుగా నిల్చునుంది మంగళ.

"మళ్ళీ ఎందుకొచ్చాడు గౌరీ ఈ ప్రబుద్ధుడు? నవ్వుతూ ఉన్న వాళ్ళని ఏడిపించడానికా? 'ఇంకా బతికే ఉన్నావా?' అనా?" అసహ్యత మాట మాట సందునా తొంగి చూసింది, మంగళ కంఠంలో వచ్చి వెళ్ళిన దెవరో మంగళకు తెలిసిందని గౌరికర్థమైపోయింది

"అవును మంగళా! నేను బతికి ఉన్నానని తెలిసే చూడడానికి వచ్చాడు" అంది తిరిగి ఆమె కళ్ళల్లో నీళ్ళూరటం ప్రారంభించాయి.

"నిన్నింత అన్యాయం చేసినవాడి కోసం ఇంకా ఏడుస్తున్నావా గౌరీ!" ఆశ్చర్యంగా అడిగింది మంగళ.

"ఇదివరకు నేను చెప్పిన కథలో అతను నా కన్యాయం చేసాడని నువ్వను కోవడం సహజమే. కాని, నిజంగా అన్యాయమైపోయిందతనే మంగళా. గడియారం ముల్లు వెనక్కు తిప్పినంత మాత్రాన కాలచక్రం తన గతి మార్చుకుంటుందా? మురళి తనకు తనే కఠిన శిక్ష వేసుకున్నాడు. రెండిటికీ చెడ్డ రేవడిగా మిగిలాడు. జరిగినది వింటే నువ్వతని మీదే జాలిపడ్తావు మంగళా." అంటూ చెప్పడ మారంభించింది గౌరి.

"మురళిబాబుది ఒక్కసారిగా ఏదైనా షాక్ తగిల్తే కొయ్యబారిపోయే తత్వం. అతని తల్లి పోయినప్పుడు కూడా వెంటనే అతనేడవలేకపోయాడు. అదంతా మొదట్లో 'నిగ్రహం' అనే అనుకున్నాం. కాని తరువాత ఆరునెలలపాటు అతను మంచం దిగలేదు. తండ్రి ధాటీకి కూడా అలాగే గడ్డ కట్టుకుపోయిన మురళిబాబు అనాలోచితంగా విమానం ఎక్కేడే కాని, తరువాత చాలా బాధ పడ్డాడట. తన తెలివితక్కువని క్షమించమని, తండ్రే కాదు, లోకమంతా ఏమనుకున్నా సరే ఎదురు నిలచి నన్నే పెళ్ళి చేసుకుంటానని, వీలయినంత వేగం తిరిగి వస్తున్నానని, నాపేర వెంటనే ఉత్తరం రాసాడట. కాని, అందుకే చెప్పేను పోయిన ఘడియలు తిరిగి రావని ఆ ఉత్తరం నాకు బదులు మా పిన్ని చేతిలో పడింది ఆవిడ నా కా ఉత్తరం సంగతే తెలియనివ్వలేదు. దానికి సమాధానం కూడా ఆవిడే రాసింది ఏం రాసిందో చూడు!" అంటూ చేతిలోని కాగితాన్ని మంగళ కందించింది గౌరి

"చిరంజీవి మురళిబాబును కాంతమ్మ దీవించి వ్రాయునది బాబూ! నీ ఉత్తరం నేను అందుకుని జవాబు రాయవలసి వచ్చినందుకు చింతిస్తున్నాను నీవు వెళ్ళిపోయిన నాలుగు రోజులనాడు నా బిడ్డ గౌరి ఈ లోకాపవాదులను భరించలేక ఆత్మహత్య చేసుకుంది. దుఃఖంతో నేను కుళ్ళిపోతున్నాను. దాని పేరెత్తితేనే మీ నాన్నగారెంత అసహ్యించుకుంటారో నీకు తెలుసును. అందుచే తిరిగి ఈ ప్రస్తావన తెచ్చి వారి మనసు నొప్పించక, జరిగిన

దుర్ఘటన మరచిపోయి, నువ్వైనా బాగు పడమని నా కోరిక

ఇట్లు
నీ శ్రేయోభిలాషి,
కాంతమ్మ.''

ఇంత పాపాత్మురాలా మీ పిన్ని'' ఉత్తరం చదివి చకితురాలవుతూ అడిగింది మంగళ.

''ఆడమనిషి కాదు మంగళా, నరరూప రాక్షసి. మరొకప్పుడయితే మురళిబాబు ఆ వార్త నమ్మదేమో కాని అప్పటికీ తన తెలివితక్కువ పనికి పశ్చాత్తాపపడుతూ నేనేమయ్యానోనని గాభరా పడుతున్నాడట. అలాంటప్పుడు నేను ఆత్మహత్య చేసుకున్నానన్నా ఏమీ అనుమానం రాలేదట మురళికి. 'ఇది ఆత్మహత్య కాదు-నేనే హత్యచేసాన'నుకుంటూ అహోరాత్రాలు కుంగి కృశించిపోయాడట ఇక పెళ్లి చేసుకోకూడదని, ఈ దేశమే రాకూడదని గట్టిగా నిశ్చయించుకుని మనసు రాయి చేసుకున్నాడట కాని, ఈ మధ్యనే వాళ్ల నాన్నగారు చనిపోవడంతో మురళికి రాకతప్పలేదు అప్పుడు తెలిసిందట మా పిన్ని రాసినదంతా అబద్ధమని- నేను పెళ్లి చేసుకుని ఇక్కడ ఉన్నట్టు ఎవరో చెప్పేరట - నేను బ్రతికున్నానన్న మాట విని ఇక ఆగలేక చూడటానికని వచ్చేసాడు కాని, నా పరిస్థితులతనికి స్వాగతం చెప్పలేకపోయాయి.'' గౌరి కళ్లల్లోంచి మళ్ళీ కన్నీరుబికింది.

'ఏడవకు గౌరీ!' అనలేకపోయిందీసారి మంగళ.

ఈ విచిత్ర నాటకానికి మూలకారణమైన శక్తి ఏదైనా సరే, కళ్లపడితే పోట్లాడితీరాలన్నంత ఆవేశంతో రక్తం సలసల మరిగిపోతూంది.

ఇటు గౌరీదేవీ, అటు సర్వమంగళాదేవీ ఉండి కొంపేమిటిలా చీకటికోణం చేసేశారంటూ కన్నతోసహా రామం ప్రవేశించేవరకూ, సూర్యాస్తమానమై పోయిందని కాని, లేచి దీపం పెట్టాలని కాని వాళ్లిద్దరికీ తట్టలేదు.

* * *

ఆ రాత్రి మంగళ కంటిమీద కునుకు పడలేదు. మాటిమాటికీ కన్నీళ్లతో వెనుతిరిగిపోతూన్న మురళిబాబు జ్ఞాపకానికొస్తున్నాడు ఒక్కోసారి ఆ రూపం మురళిది కాకుండా, రాజులా కనుపిస్తూంది. ఉలికిపడి లేచి కూచుంది మంగళ ''ఒదు దేవుడా, నేను తెలిసి ఏ పాపమూ చెయ్యలేదు కలలో కూడా అలాంటి శిక్ష వెయ్యకు తెలియక ఏమైనా పాపం చేసి ఉంటే క్షమించు '' అని లెంపలేసుకుంది. ఎందుకో అకారణంగా దుఃఖం కూడా పొర్లుకొచ్చింది

ప్రక్క గదిలోనుండి రామం మాటలు గట్టిగానే విన్పిస్తున్నాయి 'మంగళ' అన్న మాట చెవుల పడటంతో మరింత శ్రద్ధగా వింది మంగళ



''పాతిక కాదు-ఏభై కాదు - లక్ష రూపాయల కట్నం మిస్తామన్నా సరే వీల్లేదు. మంగళ రాజు కోసమే పుట్టింది!''బాధగా, ఆవేశంగా ఉంది గౌరి కంఠం.

''అరె! నేనిప్పుడేమన్నానని ఇంతకీ? వాళ్ళెవరో ఇలా సంబంధాలు చెప్పొస్తున్నారూ, అన్నానంతే గదా!'' అది రామం గొంతు.

''ఆ మాటలు వినడం కూడా నా కిష్టంలేదు.''

''నాకు మాత్రం ఇష్టమనుకున్నావా? పిచ్చిపిల్లా! రేపే రాజుకి ఉత్తరం రాయాలనుకుంటున్నాను వాడి నోటితో మరోసారి 'సరే'ననిపించడం మంచిది. పరీక్ష లయి రాగానే మంగళ మెళ్ళో మూడు ముళ్ళు వేసి, అందరి నోళ్ళు నొక్కమని రాస్తాను. వాడికి నా మాటంటే వేద వాక్కు. అదీకాక, మంగళంటే వాడికెంత ప్రేమో తెలుసా?''

''ఆహా - బాగా తెలుసు ఆ పిల్ల కళ్ళ పడితే చాలు, జట్టీ మాటలాడకుండా ఉండ లేడు!'' వెక్కిరింతగా అంది గౌరి.

''చిన్నప్పట్నుంచి వాడి స్వభావమే అంత గౌరీ!, ఎవరైనా మంగళనేమైనా అంటే చితకతన్ని వచ్చేవాడు ఒక్కర్తే ఉంటే తనే పోట్లాట ప్రారంభించే వాడు. వాళ్ళిద్దరి తత్వం అంతేలే! మంచి జోడీ!''

రామం నవ్వుతున్నాడు

మంగళకా సంభాషణంతా విన్నాక మందులో ఎందుకో అకారణంగా కలిగిన భయం పటాపంచలయిపోయింది. అప్పుడే తను పెళ్ళికూతురయిపోయినట్టు, రాజు ఎగతాళి చేస్తున్నట్టు జిలిబిలి ఊహలు చుట్టుముట్టి కళ్లు మూతలుపడేలా చేసాయి.

(సశేషం)

మినీకథ,

# ఛాలెంజ్

అదొక సర్కస్ గుడారం గుడారం అంతా ప్రేక్షకులతో నిండి ఉంది సర్కస్ జరుగుతోంది. ప్రేక్షకులంతా పుత్సాహంగా సర్కస్ చూస్తున్నారు అందమైన అమ్మాయిలు చేసే ఫీట్స్‌ను ఆశ్చర్యంగా చూస్తున్నారు. పొడుగూ, పొట్టి, బఫూన్ల చేష్టలను నవ్వుతూ చూస్తున్నారు.

ఇంతలో మైక్‌లోంచి ఒక ఎనౌన్స్‌మెంటు వినబడింది యిలా—

"ప్రేక్షకుల ముందు యిప్పుడొక వింత ప్రదర్శన ప్రదర్శింపబడుతోంది యిది మీరు యింతవరకూ ఏ సర్కస్‌లోనూ చూడని వింత ప్రదర్శన. మా ప్రేక్షకులను ఒక ఛాలెంజ్ కూడా చేస్తున్నాము. ఈ ప్రదర్శన చూసిన తరువాత మీలో ఎవరైనా 'అలా' చెయ్యగలిగితే వారికి 1,116 రూ బహుమతిగా యివ్వబడుతుంది

ప్రేక్షకులు కుతూహలంగా గమనిస్తున్నారు-ఏమిటా యింత వింత ప్రదర్శన అని'

ఆడిటోరియమ్‌లోకి మెరుపు తీగలాంటి అందమైన అమ్మాయి వచ్చింది హాయిగా ఒళ్ళు విరుచుకుంది. హాండ్‌బాగ్ తెలిచింది చిన్న అద్దం, లిప్‌స్టిక్ పైకి తీసింది పెదవులు తడిచేసుకుని అద్దంలో చూసుకుంటూ పెదవులకు 'లిప్‌స్టిక్' రాసుకుంటోంది. కాసేపటికి ఆమె పెదాలు బాగా పండిన దొండకాయ బద్దల్లా తయారయ్యాయి

ఇంతలో స్టేజిమీదకు ఒక బోను తీసుకు వచ్చారు దానిలో భయంకరమైన సింహం ఉంది. బోను తలుపు తెరిచారు. గర్జిస్తూ బయటకు వచ్చింది సింహం. నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ అమ్మాయి దగ్గరకు వెళ్ళింది

ప్రేక్షకులు విస్మయంగా చూస్తున్నారు.

సింహం అమ్మాయి దగ్గరకు వెళ్ళింది. ముందు కాళ్ళు రెండూ ఎత్తి అమ్మాయి భుజం మీద వేసింది. అమ్మాయి ముఖంలో ముఖం పెట్టింది నాలుకతో ఆమె పెదాలకు వున్న 'లిప్‌స్టిక్'ని నాకి వేసింది. 'లిప్‌స్టిక్ పోయిన ఆమె పెదాలు తిరిగి తెల్లగా అయిపోయాయి.

ప్రేక్షకులు కరతాళధ్వనులు చేశారు.

"చూశారు కదూ? యిప్పుడు మీలో ఎవరైనా 'యిలా' చెయ్యగలిగితే ముందుకు రండి. వెయ్యి నూట పదహార్లు బహుమతి గెలవండి," అని వినబడింది మైకులోంచి

నిముషం గడిచింది. ఎవరూ ముందుకు రాలేదు రెండు నిముషాలు గడిచాయి. ఉహూఁ ఎవ్వరూ ముందుకు రాలేదు. మూడో నిముషంలో ఒక వ్యక్తి స్టేజి దగ్గరకు వచ్చాడు

"వెరీగుడ్! యింత మందిలో ఒక్క ధైర్యస్థుడు కూడా లేడేమోననుకున్నాము మీరున్నారు రండి. ఆ టేబుల్ మీద అద్దం, లిప్‌స్టిక్ ఉన్నాయి. పెదాలకు 'లిప్‌స్టిక్' రాసుకోండి. సింహం వస్తుంది."

ఆ వ్యక్తి గాభరా పడుతూ అన్నాడు.

"సింహం ఎందుకు? అమ్మాయిని పిలవండి. సింహం చేసినట్లు నేనూ చెయ్యగలను."

—కోనే నాగవెంకట అంజనేయులు

# ప్రేమలేఖలు

డి. జి. రామారావు

నాకు ప్రియమైనటువంటిన్ని, నా హృదయ ఆక్రమణదారులున్నూ, ప్రేమకుమారి, అని నేను ముద్దుగా పిలుచుకునే వీరమ్మ, తండ్రి వెంకన్న సాకీను తణుకు అనే నీకు,

సదరు గ్రామ కాపరస్తుడు, వెంకటేశ్వర్లు అలియాస్ వెంకోజీ, వయసు 30, ప్లీడరు గుమాస్తా అనే నేను ప్రమాణంపై వ్రాసుకున్న ప్రేమలేఖ.

నేను లోగడనుండి నిన్ను మనసార ప్రేమింపుచూ ఉండి, సదరు నా ప్రేమను స్వయముగానూ, ఉత్తరముల ద్వారానూ, మధ్యవర్తుల కృతముగానూ తెలియచేసుకుని యున్నాను అదియుసూ గాక నీవున్నూ, నేనున్నూ గత సంవత్సరము నాగులచవితి రోజున ఉదయం 10 గంటలూ ఆ ప్రాంతమందు మన ఊరి శివాలయమునకు దక్షిణముగా జిరాయితీ మెరక RS No. 39/1 రు పూరా య. 1 42 ట్లులో ఉత్తరం ఆకుల పేర్రాజుగారి మామిడితోపులో కలసుకొని, నీ, నా ప్రేమలు వ్యక్తం చేసుకోడమే కాకుండా, మన ఉభయులమున్నూ త్వరలో వివాహము చేసుకొనుటకు, మన యిరువురికూ ఉండుకున్న ప్రేమయే ప్రతిఫలముగా ఎంచుకుని అన్ని విధముల సక్రమమైనటువంటిన్ని, 'లా' ప్రకారము చెల్లదగినటువంటిన్ని వివాహ సప్పందము మూజువాణీగా చేసుకుని యున్నాము సదరు సప్పందము పార్టు పేరఫార మెన్సు క్రింద నీవు నీ యౌవన సౌందర్యములు కొంత వరకు నా స్వాధీనము చేసియున్నావు అంతేకాక, నేనున్నూ, నీమీద నాకు గల సంపూర్ణ స్వాధీన హక్కు-భుక్తములు పూర్తిగా వదలుకొని నీ ఆజ్ఞానుసారము వర్తింపుచూ యున్నాను

అట్లుండగా నీవు గత కొద్ది రోజుల నుంచి ఏ కారణముచేతనో ముభావముగా యుంటూ నా ప్రేమను నిరాకరించుచున్నావు. నేను అరాయిదాగా ఫోగట్టా చేయగా, మన ఏజెంటుగా వ్యవహరించుచున్న మీ పనిమనిషి అప్పలమ్మ ద్వారా యీ దిగువ నుదహరించిన విషయములు తెలిసినవి అవి ఏమనగా

క్రితము నెలలో నిన్ను నేను సినిమాకు తీసుకువెళతానని రెండు లేక మూడు పర్యాయములు నమ్మించి, అట్లు జరిపింపక, నేను నిన్ను నిరుత్సాహపర్చినందుకు నీవు కోపగించి, నను ఎక్స్పార్టీ చేసి నా ప్రేమను తిరస్కరించినట్లు తెలిసినది అట్లు నేను అన్న మాట ప్రకారము జరిపించలేకపోవుటకు నాకు బలమైన కారణములు గలవు. అంతేగాని నీ ప్రేమను

కించపరుచు ఉద్దేశ్యముతో గాని, బుద్ధి పూర్వకముగా గాని అట్లు జరిపించియుండ లేదు ఆ విషయములో నా నిర్దోషిత్వ మును నిరూపించుకొనుటకు నాకు మరి ఒక సావకాశము యిప్పింపుట న్యాయ సిద్ధికి ముఖ్యావసరము. మనపై ఇనిమి కల్‌గా డిస్పోస్ అయి యున్న వారి దుర్బోధలకు లోనుగావలదని యిందు మూలముగా నిన్ను హెచ్చరించడమైనది

కాబట్టి యీ ఉత్తరం అందిన వెంటనే మన పవిత్ర ప్రేమను కాలదోషం పట్ట కుండా వెంటనే బ్రతికించుకుని వివాహము నకు తగిన ఏర్పాట్లు చేయవలసిందిగా కోరుచున్నాను. అప్పలమ్మ ద్వారా పంపు కున్న మల్లెపూవులు నేనే స్వయముగా యిచ్చినట్లు భావించి, స్వీకరించి నా ప్రేమను ఎక్నాలెడ్జి చేయవలసిందిగా వేడు కుంటున్నాను ఇది నా సమ్మతి

ఇట్లు,
గుమాస్తా వెంకోజీ వ్రాలు
హాలు మకాం, తణుకు.

## 2

డియర్ శశి,

ఏం డియర్, ఉత్తరాలు రాయడం మానేశావ్? మన ఉత్తరాలకి సడెన్‌గా ఏమిటీ సర్క్యులేటరీ ఫెయిల్యూర్? మొన్న నిన్ను టి. బి. వార్డులో చూశాను. ఆ చీకటి వార్డులో నువ్వు రోగుల మధ్య తిరుగుతూ ఉంటే నల్లని చెరువులో విరిసిన తెల్ల కలువలా ఉన్నావు. నిన్ను తలుచుకుంటే నా బ్లడ్‌ప్రెషర్ పెరిగి పోతోంది నా రొమాంటిక్ హైపర్ టెన్షన్‌కి నీ ప్రేమామృతమే రెమిడి

ఎప్పుడు నా హృదయంలో ప్రవేశిం చావో కాని నీ ప్రేమ స్వీట్ ఇన్‌ఫెక్షన్‌లా నన్నావహించింది. నా టెంపరేచర్ ఎక్కు వయింది పర్సిస్టెంట్‌గానూ, ఇంటర్ మిట్టింట్‌గానూ కొట్టుకోవడం మొదలు పెట్టింది. పైగా నిద్రలేమి, ఆకలి మంద గించటం చాలా రోజులవరకు డయాగ్నసిస్‌కి అందని నా బాధ ప్రేమ అని తెలుసుకోగానే ఎంతో ఆనందం అనుభ వించాను. సింప్టమ్స్ అన్నీ ఒక్కసారి తగ్గాయి నీ దగ్గర నుంచి ఉత్తరం లేక పోవడంతో మళ్ళీ రిలాప్స్ యిచ్చింది.

నా రోగానికి ఫార్మకోపియాలో మందు లేవు. మైసిన్‌లూ, టెట్రాసెక్లిన్లూ నాకుప శమనం కలిగించవు. నీ వాడి చూపుల యింజక్షన్లతో సూటిగా నా హృదయాన్ని తాకి, నీ ప్రేమనీ ఆనందాన్ని అందించు. నీ మధుర దరహాసంతో మండే నా శరీ రాన్ని ఎనోయింట్ చెయ్యి నీ కౌగిలి బాండేజ్‌తో అలసిన నా శరీరాన్ని నార్మ ల్సీకి రిస్టోర్ చెయ్యి.

నా నాన్‌స్పెసిఫిక్ విరహానికి ఒకే ఒక బ్రాడ్ స్పెక్ట్రమ్ యాంటీబయాటిక్ నీ స్పర్శ. మల్టివైటమిన్ సిరప్‌లాంటి నీ తియ్యని మాటలు వినందే నాకు నీరసం పట్టుకుంటుంది నా జీవితంలో యిప్పుడు సువ్వొక హాపీ అబ్సెషన్ ఆపరేషన్ చేసే కత్తులలాంటి చురుకైన, నాజూకైన నీ సన్నని వేళ్ళ నా శరీరంలో బాధ తీసేసి నన్ను కాపాడు వెల్ ఎక్విప్‌డ్ థియే టర్‌లా మా పూలతోట పిలుస్తోంది. మన ఆపరేషన్ లవ్‌కి ఆలస్యం ప్రమాదం నీ

టోకెన్

యౌవ్వనమే నాకు ఎల్ ఎస్ డి నీ మత్తులో నన్ను మైమరపించు

ఎమర్జన్సీ' డాక్టర్ శశీ' ఓర్పు హరిస్తున్న నీ పేషంటుని రక్షించుకో ఇదిగో యిప్పుడే నా ప్రిస్క్రిప్షన్‌పాడ్ మీద రాసుకుంటున్నా

టేక్ శశి, డే అండ్ నైట్ ఫర్ వైఫ్
యువర్స్ ఎవర్ డిపెండబుల్
డా ప్రేమానంద్

## 3

ప్రియమైన వరలక్ష్మీ,

నువ్వు నిజంగా ప్రియమైపోతున్నావు, రోజూ పెరిగిపోతున్న ధరల్లా నీ పేరులో లక్ష్మి ఉంది, కాపిటలిస్టుల యినప్పెట్టెలో డబ్బున్నట్టు కాని నేను కోరుకునే వరం నీ ప్రేమ నల్లబజారులాంటి నీ కురుల్లో దాచుకున్న ప్రేమని, యీ మధ్యతరగతి మాధవరావుకి డిహోర్డ్ చేసి పంచిపెట్టు అప్పుడే నీ ప్రేమకి సార్థకం దేశానికి అభ్యుదయం ప్రేమించడం మన జన్మహక్కు అది ఏ శక్తీ ఆపలేదు దాస్య శృంఖలాలను త్రెంచుకున్న ప్రజావిప్లవంలా అది ఏనాడో, ఒకనాడు విరుచుకు పడుతుంది

బూర్జువా మనస్తత్వంగల నీ తండ్రి, కులాచారాలకు ప్రతినిధిగా ఉన్న మీ అమ్మ, తమ స్వార్థాలకు నిన్ను, నీ ప్రేమనూ కించపరుస్తున్న మురా తత్వవాదులు మీ అన్నయ్యలు మన ప్రేమను వెన్నుపోటు పొడవాలని చూస్తున్నారు కాని మన ప్రేమ అజేయం ఎన్ని కష్టాలు ఎదురైనా ఎన్ని తుపాకి గుళ్ళు ఎదురొచ్చినా యీ మాధవరావు పురోగమనాన్ని ఎవరూ ఆపలేరు మనలాగే అభివృద్ధి నిరోధకుల పన్నాగాలకు బలి అవుతున్న పీడిత ప్రేమికులకు మనం ఆదర్శ దంపతులం కావాలి నీ ప్రేమ నాకు ఒక నీచమైన, పాశవికమైన కామం కాదు నాకు అది ఒక యిజం యిది పదహారణాల నిజం మన ప్రేమ విజయం మన సంఘ చరిత్రలో ఒక మైలురాయి కావాలి మితవాద శక్తులకి కన్ను విప్పు కావాలి మనది ముందుకు వేసిన అడుగు అది అగ్నిహోత్రం చుట్టూ ఏడడుగులు వేసి తీరుతుంది మన పూలరంగుల ప్రేమ బావుటా యు ఎన్ ఒ శిఖరాగ్రంపైన ఎగురవేద్దాం మన ప్రేమాణుశక్తి విజృంభించి నవచైతన్యం వెదజల్లుతుంది నీ కంఠంలో నాకు భవిష్యత్తు వినిపిస్తుంది నీ చూపులో నాకు ఆగామిలోకాలు కనిపిస్తాయి నీ నడకలో నాకు జగన్నాధుని రథ చక్రాల కంపనం స్ఫురిస్తుంది

(హిమాలయ శిఖరాలను అధిరోహించుదాం వియత్నాం వీధుల్లో విహరిద్దాం కలకత్తా కాళికలను దర్శిద్దాం బంజరు భూముల్లో పాటలు పాడదాం )

వరలక్ష్మీ, నమ్ము నిన్ను నేను గాఢంగా ప్రేమిస్తున్నాను మన వివాహం ఏ శక్తీ ఆపలేదు ధైర్యం తెచ్చుకో మనల్ని విడదీయడానికి ప్రయత్నించే యీ సంఘాన్ని కూకటి వేళ్ళతో కదిలిద్దాం ఇదే మన ప్రతిజ్ఞ

జై వరలక్ష్మీ' జై మాధవరావ్
మన ప్రేమ వర్ధిల్లాలి
మధ్యతరగతి మాధవరావు ★

మినీ
సీరియల్

# మూడు రాత్రులు

## 12

అదృష్టవశాత్తు చిన్న సెలయేరు కనపడింది ఇద్దరికీ

సూర్యుడు అస్తమించి చాలాసేపయింది చీకటి ఆవరించింది అడవి అంతా

మూడో రాత్రి అది

ప్రతిమ, రవివర్మ కలిసి గడిపే మూడోరాత్రి అది ఆ అడవిలో కొంత దూరం సాగాక, ప్రతిమ చూసింది ఆ చిన్న సెలయేటిని నీళ్ళు మిగిలి వున్నాయి పూర్తిగా ఎండిపోలేదు సెలయేరు

రవివర్మ, ప్రతిమ ఇద్దరూ కలసి స్నానంచేసారు దాంట్లో స్నానంచేసాక బడలిక, వళ్ళు నొప్పులు కొద్దిగా తగ్గినట్లుగా అనిపించింది రవివర్మకి, భుజంలోని గాయంలో బాధ మొదలయినా

అంతదాకా వున్న నిద్రమత్తు కూడా వదలిపోయింది క్రొత్త వుత్సాహం ప్రవేశించింది ఇద్దరిలో రవివర్మ నోరు ఇంకా స్తపొక్కటంవల్ల ఆ రాత్రి ఏమీ తినదలమకోలేదు ఇక బాణం గుచ్చుకున్న చోట, భుజంలో మాత్రం కొద్దిగా నొప్పి ఎక్కువయింది

సెలయేటికి కొంతదూరంలో వున్న పెద్ద చెట్టుమీదికి ఎక్కి పడుకోవాలని నిర్ణయించింది ప్రతిమ సెలయేటికి దగ్గరలో వుంటే, క్రూర జంతువులు, మనుష్యులు నీటికోసం రావచ్చు ఎంతదూరంగా వుంటే అంత వుత్తమం

ఆ సెలయేటికి, అయిదు నిముషాల నడక దూరంలోవున్న ఓ పెద్ద మర్రిచెట్టు ఎక్కి, ప్రతిమ రవివర్మ ఎక్కేందుకు సహాయపడింది

మొన్నరాత్రిలా మంచె ఏర్పాటు చేసిలేదు ఆ చెట్టుకొమ్మలమీద సుఖంగా పడుకోవడానికి అనువుగా లేదు రవివర్మ ప్రయత్నించాడు కాని, కుదరలేదు నిద్రలోజారి కిందపడటం తప్పదని భావించాడు

క్రింద రక్షణ ఆట్టే వుండకపోయినా, చెట్టుమొదల్లో వున్న ఓ విశాలమయిన రెండు కొమ్మలమీద పడుకున్నాడు రవివర్మ. పులి చూస్తే, గట్టిగా ఎగిరితే అందుతాడు రవివర్మ. అక్కడినుంచి కిందపడినా ఆట్టే దెబ్బ తగలనంత ఎత్తులో వుంది.

రవివర్మ ప్రక్కనే పడుకుంది ప్రతిమ. అలా తన ప్రక్కన పడుకున్న ప్రతిమని చూస్తూంటే, ఎనలేని ప్రేమ ముంచుకొచ్చింది రవివర్మకి ప్రతిమమీద.

మూడు రోజులనుంచి తన కోసం ఎంత ప్రయాసపడుతోంది? కట్టుకున్న భార్యకూడా ఇంత ప్రేమగా, భక్తిగా చూడదేమో? దారి కనుక్కోగానే, తన లోకం లోకి తను బయలుదేరగానే వెనక్కి తిరగక తప్పదు ప్రతిమ.

ఆ తర్వాత ప్రతిమ బహుశా తనవి చూడలేదు. తనుకూడా ప్రతిమని చూడలేకపోవచ్చు, తన మిత్రుడు ప్రయత్నిస్తున్న బదిలీ వస్తే.

ఎంత మంచిది ప్రతిమ.

షి యీజ్ ఏన్ ఏంజెల్.

ప్రతిమ నుదుటిమీద ముద్దుపెట్టుకున్నాడు రవివర్మ, నిద్రలోకి జారిపోయిన ప్రతిమకి మెలకువ రాలేదు. అలసిపోయిన ప్రతిమని లేపటం ఇష్టంలేక, ప్రక్కకి తిరిగాడు రవివర్మ.

దూరంగా, చాలా దూరంగా ఏదో వెలుగు కనిపించింది.

మొదట తన భ్రమేమో ననుకున్నాడు రవివర్మ. పరీక్షగా చూసి నిజంగా వెలుగు కనబడుతోందనే నిర్ణయానికి వచ్చాడు. తమని వెతుక్కుంటూ వస్తున్న తన మిత్రుడా?

ఓ సందేహం కూడా కలిగింది రవివర్మకి. ఆ ఆటవికులు, తనని చంపడానికి ప్రయత్నించిన ఆ ఆటవికుణ్ని, తాము వాణ్ని చంపటం కనుక్కొని, పగతీర్చుకోడానికి వెదుకుతూ వస్తున్నారా?

రవివర్మ మరి కాస్త పరకాయించి చూశాడు.

ఆ వెలుగు క్రమక్రమంగా ఎక్కువవుతోంది. పెద్దదవుతోంది. కాగడా కాదు. మనిషి దారి కనబడటానికి వెలిగించే వెలుగు కాదది.

మరోటి. చెవులకి ఏదో చప్పుడు కూడా వినిపించింది సన్నగా.

హోరు. ఆ చప్పుడు. వేగంగా, గాలితోపాటు తీవ్రంగా కదిలే మంటల చప్పుడది.

క్రమక్రమంగా ఇంకా పెద్దదవుతోంది. అంతదాకా నిశ్శబ్దంగా వున్న అడవి అంతా, క్షణాలలో అనేక శబ్దాలతో నిండిపోయింది. ఆర్తనాదాలు అవి. జంతువులవి.

పక్షులు అనేకరకాలు గూళ్ళలోంచి అరుస్తూ ఎగురుతున్న చప్పుడు, అనేక మృగాలు భీతితో అరిచే చప్పుడు, ఏనుగు ఘీంకారాలు. ప్రళయం వస్తున్నట్లుగా వుంది అంతా.

ప్రతిమ లేచింది వులిక్కిపడి, రవివర్మ లేపగానే. చూపించాడు చేత్తో. ఇప్పుడు మంట ఇంకా ఎక్కువగా అయింది ఆ మంటల తాలూకు వెలుగు కొద్దికొద్దిగా పడుతోంది ఇద్దరిమీద

చుట్టుప్రక్కల చెట్లమీద నిదురించే జంతువులు, పక్షులు అరుస్తున్నాయి.

ప్రతిమ కిందకి దూకింది గబగబా దిగాడు రవివర్మ ప్రతిమ చేతిని పట్టుకుని పరిగెత్తసాగాడు రవివర్మ కూడా గుండెలు దడదడలాడుతూంటే, భయంగా.

ఆ అడవిలోని మిగతా జంతువులలాగా, వాటిలో ఇద్దరుగా మారి, ప్రతిమ, రవివర్మ పరిగెత్తసాగారు

రవివర్మకి తెలుసు అదేమిటో దానివల్ల కలిగే తప్పించుకోలేని ఘోరమయిన ప్రమాదం గురించి తన మిత్రుడు చెప్పగా విన్నాడు

దావానలం అది

ఫారెస్టు ఫైర్

# 13

'ఒక చెట్టు లక్ష అగ్గిపుల్లల నివ్వగలదు
ఒక అగ్గిపుల్ల లక్ష చెట్లని కాల్చగలదు'

ఇంగ్లీష్‌లో వ్రాసిన ఆ బోర్డుని చూసి అడిగాడు రవివర్మ అయిదురోజుల క్రితం, కేంప్‌లోని తన మిత్రుడిని

''ఏ ఇంగ్లీష్ రైటర్ కొటేషన్ అది?''

రవివర్మ మిత్రుడు చిన్నగా నవ్వి బదులు చెప్పాడు

''నాకు తెలిసినంతవరకు ఏ ఇంగ్లీష్ రచయితా వ్రాయలేదా కొటేషన్ డిపార్ట్‌మెంట్‌కి సంబంధించినవాళ్ళే ఎవరో వ్రాసి వుంటారు''

''దాని అర్థం ఏమిటి?''

''బాబా ఫారెస్టు ఫైర్స్ గురించి విన్నావా ఎప్పుడైనా?''

''వూహూ''

''అడవుల్లో చాలా తరచుగా సంభవిస్తూంటుందిది నిప్పురాజుకుంటుంది ఏ మూలో, రెండు ఎండిపోయిన కొమ్మలు గాలికి రాచుకుని వేసంకాలంలో ఎండవేడికి బాగా ఎండివుంటుంది టింబర్‌కి పనికివచ్చే వృక్షం వేసంకాలంలో అడవిలోని చెట్లూ, పొదలూ అన్నీ సాధారణంగా ఎండిపోయి వుంటాయి కొంచెం కొంచెంగా ప్రారంభం అయిన నిప్పు మండి, క్రమంగా అడవి అంతా పాకుతుంది''

''అడవి అంతా?''

''అవును ముక్కు వెయ్యి అడవి అంతా పాకి అడవి మొత్తం తగులబడి పోతుంది దాన్నే ఫారెస్టు ఫైర్ అంటారు దావానలం అన్నమాట వినలేదా?''

''విన్నాను 'దావానలంలా వ్యాపించింది' అన్న ఫ్రేజ్ విన్నాను చాలాసార్లు ''

''అంటే అంత త్వరగా వ్యాపిస్తుందన్నమాట అడవిలో అగ్ని మొదలయితే ఒక్కొక్కసారి గంటకి రెండువందల కిలోమీటర్ల వేగంతో పాకిపోతుంది ''

''అయితే ఆ బోర్డ్‌కీ, దీనికీ ఏమిటి సంబంధం?''

''ఉంది అడవిలో అగ్గిపుల్ల గీసి వేటగాళ్ళు సిగరెట్ వెలిగించుకుని దాన్ని నిర్లక్ష్యంగా పారేస్తారు ఏ దుబ్బుమీదోపడి అది అంటుకుంటే, క్రమంగా వ్యాపించి అడవినంతా దహించి వేస్తుందా చిన్న అగ్గిపుల్లకున్న మంట అందుకని వాళ్ళని అలా చేయకుండా వారిస్తూ సైన్‌బోర్డ్స్ ముఖ్యమయిన చోట పెడతాము ''

''ఒన్ కార్డ్ షో నాది'' అన్నాడు రవివర్మ తన చేతిలోని పేక ముక్కలని చూసుకుని

''సాధారణంగా అడవుల్లో దావాలనం దానంతటదే మొదలవదు తగలబెడతారు కావాలని ''

''ఎవరు తగలబెడతారు? ఎందుకు?'' అడిగాడు రవివర్మ ముక్క వేస్తూ

''ఆటవికులు తరతరాలుగా వస్తున్న సాంప్రదాయం అది వాళ్ళకి ఈ సాంప్రదాయంవల్ల, అడవులని నరికి వ్యవసాయం చేయడంవల్ల మనకి లెక్కలేనంత సొమ్ము నాశనం అయిపోతోంది ''

''ఏంలాభం వాళ్ళకి తగలబెడితే అడవులని?''

''ఓచోట కావాలని నిప్పు రాజేస్తారు క్రమంగా అది అడవిఅంతా పాకుతుంది. అంటించే వాళ్ళు ఎంతో జాగ్రత్తగా వుంటారు గాలివీచే దిశ జాగ్రత్తగా ని మరీ అంటిస్తారు లేకపోతే ఒకోసారి ఆ మంటలు వాళ్ళు బయటపడే విజృంభించి వాళ్ళనే కబళిస్తాయి ''

రవివర్మ పేకముక్కలు కిందపడేసి అన్నాడు

''నేను గెలిచాను ''

రవివర్మ మిత్రుడు కూడా పేకముక్కలు కిందపడేసి అన్నాడు కొద్దిగా నిస్పృహగా

''నాది ఇప్పుడు ఒన్ కార్డ్ షో అయినది నువు రోజూ క్లబ్బుల్లో ఆడటంవల్ల అలవాటు నీకు నాకు మా ఆఫీసర్ భార్య, డ్రయివర్ తప్ప మరెవ్వరూ తోడులేరు ఆడటానికి ''

ముక్కలు మళ్ళీ కలుపుతూ అడిగాడు రవివర్మ, తన స్నేహితుడిని మధ్యలో వదలిన సంగతి

''ఇంతకీ అడవుల నా విధంగా తగలబెట్టడంవల్ల జరిగే లాభమేమిటో చెప్పనేలేదు నువ్వు?''

''అవును ఆ పాయింట్‌కే వస్తున్నాను అడవుల్లో అనేకమయిన జంతువు




లుంటాయి వాటినన్నిటినీ వేటాడాలంటే కష్టం. అడవులు తగలబెట్టి, మంటలు ఆరిపోయాక నెమ్మదిగా వచ్చి, ఆ మంటల్లో చిక్కుకుని చచ్చిపోయిన జంతువుల్ని ఏరి తీసుకు వెళ్తారు వాటిని తింటారు ''

రవివర్మ వింటూ ముక్కలు పంచసాగాడు మళ్ళీ రమ్మీ ఆడటానికి

''అంతేకాదు కాలిపోయిన ఆ అడవుల్లోంచి బొగ్గుకూడా లభ్యమవుతుంది. ఒక్కొక్కసారి అలా మొదలయిన మంట రోజుల తరబడి ఆరకుండా అలాగే మండుతుంటుంది వందలకొద్దీ మైళ్ళు పాకుతుందా మంట ''

''వందలకొద్దీ మైళ్ళు! మనకి అంత వైశాల్యంగల పెద్ద అడవులున్నాయా?''

''వున్నాయి అమెరికాలో యీ ఫారెస్టు ఫైర్స్ ఎక్కువగా సంభవిస్తూంటాయి. ఉత్తర అమెరికానో, దక్షిణ అమెరికానో గుర్తులేదు సరిగా ఫారెస్టు ఫైర్ మొదలయితే వాళ్ళు శాయశక్తులా కృషిచేస్తారు ఆర్పడానికి వైర్‌లెస్‌ద్వారా ఆ మంటలు ఎటువైపు పయనిస్తున్నాయో చెప్పి, ఆ మంటలు వెళ్ళే దారిలోవున్న చిన్న చిన్న గ్రామాలని ఖాళీ చేయిస్తారు

నాలుగయిదు వందలగజాల మేడచెట్లని, తగులబడే ప్రకృతిగల ప్రతీ వస్తువుని పడకొట్టి దూరంగా చేరేసి, నేలంతా బోసిగా వుంచుతారు మైదానంలా మంటలు అక్కడితో ఆగిపోతాయి ఇంకా ముందుకు పాకేందుకు ఆస్కారంలేక. అలా ఆపడానికి సమయం చాలకపోతే, నీళ్ళతో తడిపేస్తారు దారిలోవున్న చెట్లని మొదలయిన వాటిని ''

''నే నెప్పుడూ వినలేదు ''

''ఈ డిపార్ట్మెంట్లో చేరక మునుపు నాకూ తెలియదు ఆ మంటలు ఏభై మైళ్ళ దూరంలో వుండగానే మనకి వెలుగు కనబడుతుంది వేడిగా వుంటుంది కాలు తూంటే అయే చప్పుడు సముద్రపు హోరులా వినిపిస్తుంది ''

రవివర్మ తన చేతిలోకి పంచిన ముక్కలని అందుకుని, సర్దుకోసాగాడు

''అలా ఎవరూ అడవులని స్వప్రయోజనంకోసం తగులబెట్టకుండా శ్రద్ధతీసుకోవడం మా విధులలో ఒకటి అడవిలో ఎప్పుడయినా చలికాచుకున్నా, టీ తయారు చేసుకున్నా, నిప్పు మళ్ళీ పూర్తిగా ఆర్పికాని కదలము అక్కడనుంచి ''

''ఈ అడవుల్లో వెదురు చెట్లెక్కువ అందులో ''

''అవును - వర్షాకాలం ప్రమాదం వుండదుకాని, వేసంకాలం వెదురు పొదలతో చెట్లతో, ఆకులతో నిండివుండే యీ అడవులు చాలా ప్రమాదం ఏమాత్రం నిప్పు అందినా ఇక ఆగదు తరచు సంభవిస్తూంటాయి ఫారెస్టు ఫైర్స్ ఆర్పడానికి ప్రయత్నం చేస్తాం వెంటనే ''

''నచే డేంజరస్‌గేమ్ మీరే చిక్కుకుంటే దాంట్లో బయటపడలేక?''

ముక్కవేసి, చిన్నగా నవ్వి అన్నాడు అతను

''జాగ్రత్త తీసుకుంటాము ''

''ఒకవేళ?''

''ఆ సంగతి నీకు తెలియజేయబడుతుంది ''

''ఛట్ ''

''అవును మిగతా మృగాలతోబాటు కాలి చచ్చిపోతాను ఒక్కసారి చిక్కుకుంటే విముక్తి వుండదు ఆ అగ్నిదేముడు నుంచి నిలువునా కాలి దగ్ధమయిపోవాలి అంతే ''

# 14

అలా ప్రతిమ చెయ్యిపట్టుకుని, భయంగా పరిగెత్తుతూంటే రవివర్మకి, తన స్నేహితుడు చెప్పిన సంగతులన్నీ మనసులో కదిలాయి

ప్రతిమ లేడిలా, ఎక్కుపెట్టి వదలిన బాణంలా, తుపాకీగుండులా దూసుకుంటూ పరిగెత్తుతోంది వగరుస్తూ పరిగెత్తుతున్నాడు రవివర్మ కూడా పక్షులు, జంతువులు అరుస్తున్నాయి వాళ్ళతో సమానంగా పరిగెత్తుతూ

మంటతోపాటు దగ్గరవుతున్న వేడి క్రమక్రమంగా భరించలేనంతగా మారుతోంది వెనకాలనుంచి కాలుతూ వస్తున్న మంట సముద్రం పొంగుతున్న చప్పుడిలా దగ్గరవుతోంది అంతదాకా చీకటిగా వున్న ప్రదేశమంతా కోటి కేండిల్స్ బల్బ్ వెలిగించినట్లుగా, ఎర్రటి వెలుగుతో నిండిపోయింది

పెద్దగా గాండ్రిస్తూ రవివర్మకి వందగజాల దూరంలోంచి పరిగెత్తిందో పులి ప్రాణభయంతో ప్రక్కన ఏమున్నదీ చూడకుండా పరిగెత్తుతోందా పులి భయంగా

ఆగిపోయిన రవివర్మని గమనించలేదది ప్రతిమ రవివర్మ చెయ్యిపట్టుకుని లాగింది పరిగెత్తుతూ.

"వి ఆర్ అవుట్ మనకి దాక్కోనేందుకు చోటులే చెక్కడా ఆ కొండ చాలా దూరంలో వుంది దాన్ని అందుకోలేం" వగరుస్తూ అన్నాడు వర్మ .

ప్రతిమ ఆగిపోయింది ఒక్కక్షణం మళ్ళీ రవివర్మని లాగుతూ పరిగెత్త సాగింది నల్లటి పొగ చుట్టేసింది ఇద్దరినీ అప్పటికే

ఒకే ఒక్క నిముషం

ఆ తర్వాత తామిద్దరూ ఇక మసే అనుకున్నాడు రవివర్మ అకస్మాత్తుగా కాళ్ళకి చల్లటినీళ్ళు తగిలాయి రవివర్మకి నీళ్ళు క్రమక్రమంగా పెరిగి నడుంనుంచి చెవులదాకా వచ్చేసాయి గబగబా పరిగెత్తుతూంటే

ఈత కొడుతోంది ప్రతిమ కాళ్ళందక ఇక రవివర్మ ఒక చేత్తోనే ప్రక్కకి తిరిగి యీతకొట్టసాగాడు నీళ్ళలో వేడి తెలియటంలేదు కాని భుజంలోని గాయం మాత్రం సలుపుతోంది

పెద్ద సరస్సు అది నిండుగా చాలాదూరం దాకా నీళ్ళున్నాయి చుట్టూ అదృష్టం తమపక్షాన వుంది నీళ్ళమీదకి వచ్చి, తమని ఆ మంటలు కబళించలేవు అదృష్టం ప్రతిమ రూపంలో తనని కాపాడింది, సమయానికా సెలయేరులోకి దారి చూపి

రెండో చెయ్యి పనిచేయకపోవటంవల్ల, ఒంటిచేత్తో ఈతకొట్టడం కష్టంగా వుంది రవివర్మకి భయం వేసింది ఎన్నిగంటలు ఇలా యీతకొడుతూ సరస్సులో తిరగగలడు తను? మునిగి చచ్చిపోతాడు యీతకొట్టలేక, కొన్ని గంటలయాక

ప్రతిమ కొంచెందూరం వెళ్ళి, మళ్ళీ వెనక్కి వచ్చింది యీదుకొంటూ. రవివర్మ షర్ట్‌కాలర్ పట్టుకుని లాక్కెళ్ళింది గబగబా

పెద్ద బండరాయి వుందా సరస్సుమధ్య రవివర్మని ఆ రాతిమీదకి చేర్చి, వెనకే తనూ వచ్చింది ప్రతిమ ఆ రాతిమీదకి అయిదారు నిముషాలదాకా ఎవరూ మాట్లాడకుండా, ఆయాసం, గుండె దడ తీర్చుకునే ప్రయత్నం చేస్తూండిపోయారు

ఒకరి చేతిని మరొకరు గట్టిగా పెనవేసి పట్టుకుని, చుట్టూ చూస్తూండిపోయారు, రేగుతున్న మంటలని, నల్లటి పొగకుండా

చాలా విశాలంగా వుండటంవల్ల, మంటలు తాలూకు వేడి, సెగ అట్టే బాధించటంలేదు వాళ్ళిద్దరినీ కాని దాదాపు ఏభై కిలోమీటర్ల వేగంతో వీస్తున్న గాలి మాత్రం మంటలమీదనుంచి వస్తూండటంవల్ల వేడిగా, వాడిగా తగులుతోంది

సరస్సులోని నీళ్ళని ఒంటిమీద చల్లుకుని, అవి వేడిగాలికి ఆవిరయే లోపలే, మళ్ళీకొత్త నీళ్ళు చల్లు కుంటున్నారు ఇద్దరూ వేడిగాలినుంచి ఆ విధంగా వుపశమనం పొందసాగారు

నల్లటి పొగలు పైకిలేచి, ఆకాశమంతా నల్లటి దుప్పటి కప్పినట్లుగా, పైన పొగ ఆవరించింది మంటల మీదనుంచి పొగ ఇంకా లేస్తూనే వుంది

భీభత్సంగా మండుతోంది చుట్టూ అడవిలోని ఎండు దుబ్బులు, చెట్లూ, వెదురు పొదలు, లతలు, తీగలు, సమస్తం తగలబడి పోతున్నాయి ఆ మంటల్లో

ఈతవచ్చిన కొన్ని కొన్ని జంతువులు మాత్రం యీదుకొంటూ వచ్చాయి సరస్సులోకి కొన్ని జంతువులు గట్టుదగ్గిరే నిలబడిపోయాయి నీళ్ళలోకి రాలేక, భయంగా అరుస్తూ

"ప్రతిమ" పిల్చాడు రవివర్మ

ప్రతిమ రవివర్మ కళ్ళలోకి చూసింది

ప్రతిమ నడుంచుట్టూ చేయివేసి అన్నాడు రవివర్మ

"ఇలా చుట్టూ మంటలు చెలరేగుతూంటే, వాటిలోంచి నిముషాల వ్యవధిలో తప్పించుకుని, ఓ సరస్సులో, బండరాయిమీద నీతో ఇలా కూర్చుంటానని అనుకున్నానా? పోనీ కలగన్నానా ఎప్పుడైనా! జీవితం ఎంత వూహించలేనిది."

గలగలా నవ్వింది ప్రతిమ ప్రతిమకి తను చెప్పింది అర్థమయిందో లేదో తెలియలేదు రవివర్మకి

ప్రతిమని దగ్గరగా లాక్కుని, అలా దగ్గరగా ఆనుకుని కూర్చున్నాడు చాలా సేపు ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు ప్రతిమకూడా త్వరలోనే నిద్రలోకి జారి పోయింది.

మర్నాడు తెల్లవారుఝామున మెలకువ వచ్చింది రవివర్మకి నిద్రలో జారి బండరాయిమీదనుంచి నీళ్ళలోకి పడ్డాడు పడగానే మెలకువ వచ్చింది రవివర్మ నడుం చుట్టూ చేయివేసి పట్టుకునున్న ప్రతిమ కూడా నీళ్ళలోకి పడ్డది

ఇద్దరూ బండరాయిమీదకి చేరుకున్నారు తిరిగి నీటిలోంచి

సరస్సుమీద తెల్లగా, మంచులా పేరుకుని వుంది పొగ మంటలులేవు సరస్సు చుట్టూ ఇప్పుడు నల్లగా మాడిపోయి వున్నాయి చెట్లు, నేలవాలిపోయి తెల్లటి పొగ వస్తోంది ఆ అడవిలోంచి నేల అంతా నల్లగా వుంది

రవివర్మ, ప్రతిమ కాసేపు అలాగే కూర్చుండిపోయారు చుట్టూ చూస్తూ రాత్రి చలి తెలియలేదు ఆ మంటలవల్ల ఎటు వెళ్ళాలో, ఎలా వెళ్ళాలో తెలియలేదు రవివర్మకి

ప్రతిమ తనని అనుసరించమన్నట్లుగా సౌంజ్ఞచేసి ఓవైపు ఈదసాగింది రవివర్మ ప్రతిమ వెంట ఒడ్డుకి చేరుకున్నాడు యీది భుజం బాగా సలుపుతోంది గాయందగ్గర కారం చల్లినట్లుగా మండసాగింది నీళ్ళు తగలగానే

వెంటనే మందు వెయ్యకపోతే సెప్టిక్ అవుతుందేమోనన్న భయం కలిగింది రవివర్మకి ప్రతిమ దాదాపు పావుమైలు దూరంలో వున్న కొండవంక చూపించింది,




అక్కడికే తాము చేరాలన్నట్లుగా

ముందు నేలంతా నల్లగా వుంది కాలిన బూడిదతో నిండి పొగలు వస్తున్నాయి ాటిమీదనుంచి వేడి సెగకూడా వస్తోంది కొంచెం కొంచెం ఒడ్డున పడుకుని నిద్ర ోతున్నాయి రకరకాల జంతువులు

"ఎలా అక్కడికి చేరటం?" అడిగాడు రవివర్మ

నిస్పృహగా చూసింది ప్రతిమ కాలిపోయిన ఆ అడవివంక కాళ్ళు, కాలకుండా ాటడం కష్టం ఏర్‌బేగ్ కూడా జారిపోయింది రాత్రి ఎక్కడో ఒంటిమీద బట్టలతో ుగిలారు ఇద్దరూ

ప్రతిమ ఒడ్డున కూర్చుంది ఇక చేసేది ఏంలేదన్నట్లుగా ప్రక్కన కూర్చున్నాడు విివర్మ కొంచెం దూరంలో విశ్రాంతి తీసుకుంటున్న జంతువులవంక చూసాడు

రెండు తాబేళ్ళు, నాలుగయిదు మేకలు, ఏభైగాకా కుందేళ్ళు, నక్కలు, ెక్కలేనన్ని కోతులు, పక్షులు, లేళ్ళు, దుప్పులు, నెమళ్ళు చాలా జంతువులు దగ్గర ్గిరగా పడుకుని వున్నాయి

ప్రతిమ చటుక్కున లేచి వెళ్ళి, ఓ మేకని చెవులు పట్టుకుని లాక్కొచ్చింది. విివర్మకి సౌంజ్ఞ చేసింది దోసిలి పట్టమని పాలు పితికింది రవివర్మ దోసిలిలోకి. విివర్మ పాలని కొంచెం తాగగానే ఆకలి విజృంభించింది వక్కసారిగా

తను భోజనంచేసి మూడురోజులు దాటింది అనుకున్నాడు రవివర్మ వెంటనే ేచి, చేతులు కడుక్కుని, కాలిపోయిన అడవిలోకి అడుగుపెట్టాడు. పంద గజాలదాకా

తిరిగి, వెదకి, చేత్తో కాలిపోయిన ఓ కుందేలు పిల్లని తీసుకు వచ్చాడు ప్రతిమ ఆనందంగా అరిచింది రవివర్మ చేతులోని చెవుల పిల్లిని చూడగానే

"డింప్లీ" అన్నది సంతోషంగా

రవివర్మ చిన్నగా నవ్వి అందించాడు దాన్ని ప్రతిమ దానిని తినే విధంగా మలుస్తూంటే, రవివర్మ మరో మేకని పట్టుకుని, నోట్లోకి పాలు పితుక్కునే ప్రయత్నం చేసాడు చాలా భాగం కళ్ళమీద ముఖంమీద ఒలికిపోయాయి, అది అరుస్తూ తప్పించుకునే ప్రయత్నం చేస్తూంటే

రవివర్మ ముఖం, మెడ, ఛాతీ పాలతో తడిసిపోయింది ప్రతిమ విరగబడి నవ్వింది అరుస్తున్న మేకతో అవస్థపడుతున్న రవివర్మని చూసి దాన్ని తిట్టుకుంటూ, మళ్ళీ ఆ సరస్సులోని నీళ్ళతో తుడుచుకున్నాడు రవివర్మ, పాలుపోయేలా మెడ, చేతులు, ఛాతీ

రాతియుగపు మానవుడికి ఆహారమయిన, అడవిలో కాలి వచ్చిపోయిన కుందేలు మాంసాన్ని ఆత్రంగా, ఇష్టంగా తిన్నారు ఇద్దరూ, కడుపునిండా

సాయంత్రం చల్లబడేదాకా కూర్చున్నారు అక్కడే కదలకుండా క్రమంగా పొగ రావడం కూడా తగ్గిపోయింది చుట్టుప్రక్కల పేరుకున్న పొగ అంతా మాయ మయిపోయింది చాలా జంతువులు ఆ కొండవైపు వెళ్ళిపోయాయి

ప్రతిమకి జ్వరం వచ్చినట్లుగా గ్రహించాడు రవివర్మ కొంచెం వెచ్చగా వుంది వళ్ళు, దగ్గరకు తీసుకోగానే

తన ప్రయత్నం విరమించుకున్నాడు కాని ప్రతిమ ఒప్పుకోలేదు రవివర్మని మీదకి లాక్కుంది ఆ నీటి ఒడ్డున, ప్రశాంతంగా వున్నచోట, గంటపైనే ఇద్దరూ మైమరచిపోయారు ప్రకృతిని, ప్రపంచాన్ని

సాయింత్రం సూర్యుడు అస్తమించడానికి రెండున్నర గంటలముందు బయలు దేరారు ఇద్దరూ ఆ పావుమైలు దూరంలో వున్న కొండవైపు ప్రతిమని రెండు చేతులతో ఎత్తుకుని, తన బూట్ల కాళ్ళతో పరిగెత్తాడు రవివర్మ పరిగెత్తడానికి వీలు లేని చోట నడిచాడు

ఆ పావుమైలు దాటడానికి ఇరవై నిముషాలు పట్టింది ఆ ఇరవై నిముషాలు ఇరవై యుగాలుగా గడిచాయి రవివర్మకి బూట్లు తొడుక్కున్నా కూడా, భూమిలోంచి, కాలిన దుంగల్లోంచి వచ్చే వేడి తగులుతూనే వుంది కాళ్ళకి

అడ్డుగా వున్న పెద్దపెద్ద బూడిదకుప్పలు దాటేటప్పుడు, బూట్లలోకి, కాళ్ళకి వేడి బూడిద అంటుకుని నరకాన్ని జ్ఞప్తికి తెచ్చింది ఆ ఇరవై నిముషాలు.

ఇరవై నిముషాలదాకా అలా నడవలేకపోయేవాడు, తనచేతుల్లో అందాల భరిణ ప్రతిమ లేకపోతే కొండదగ్గిర దించాడు ప్రతిమని కొండరాళ్ళు వేడిగా వున్నాయి. కాని అవతలనుంచి కొద్దిగా చల్లగాలి రాసాగింది

ఇద్దరూ ఆ చిన్న కొండ అంచువెంబడే నడిచారు. ప్రతిమ ఓచోట ఆగి రవివర్మ చేతిని పట్టుకుని కొండలోవున్న చిన్న గుహలోకి ప్రవేశించింది లోపలకి వెళ్తున్నకొద్దీ చీకటి అధికం అయి, చివరికి కళ్ళముందు నల్లటి తెరలు కట్టినట్లుగా అయింది

ఆ గుహల్లో విషసర్పాలుంటాయేమోనన్న భయంకలిగింది రవివర్మకి అలాంటి గుహలో నడవడానికి ప్రతిమకి వున్న గుండె ధైర్యానికి అబ్బురపడ్డాడు గుహ రాను రాను సన్నమవుతున్నట్లుగా కూడా గ్రహించాడు

పాము బుసలు వినిపిస్తున్నాయి మధ్యమధ్యలో ఒళ్ళు జలదరిస్తోంది రవివర్మకి ఇంత కష్టపడి చివరకి యీ గుహలో తన ప్రాణం ఏ పాము కాటుకో అంతం అవుతుందనే ఆలోచనలో రోమాలు నిక్కబొడుచుకున్నాయి ప్రతిమ చేతిని వదల కుండా, గట్టిగా పట్టుకున్నాడు

నాలుగయిదు నిముషాల తర్వాత గుహ మళ్ళీ వెడల్పు అవసాగింది కొద్దికొద్దిగా వెలుగు రాసాగింది మరో నాలుగు నిముషాల తర్వాత దూరంగా చుక్కలా కనిపించింది వెలుగు, చందమామ ఆకృతిలో

సూటిగా ఆ వెలుగువంకే నడవసాగారు ఇద్దరూ నడుస్తున్నకొద్దీ అది వెలుపలికి దారి అని, చందమామ కానీ, సూర్యుడు కానీ కాదని అవగాహన అయింది రవివర్మకి ఆ గుహ ముఖంలోంచే వస్తోంది వెలుతురు లోపలికి

ఆ గుహద్వారం దగ్గరకి చేరుకున్నాక వూపిరి పీల్చుకున్నాడు రవివర్మ బయటకి చూసాడు

అడవి

వేసవికాలంలో చాలా భాగం పూర్తిగా ఎండిపోయినా, అక్కడక్కడ కనిపించే పచ్చటి ఆకులతో పచ్చగా కనిపించింది అడవి ఇద్దరి కళ్ళకి కొండ అడ్డు వుండటం వల్ల మంటలు అవతలివైపుకి పాకలేదు అగ్నికి ఆహుతి అవకుండా కొండ కాపాడింది, ఆ అడవిని

చిన్నగా నిట్టూర్చాడు రవివర్మ

బయటకి రాగానే చల్లగాలి తగిలింది ఆహ్లాదంగా

ఆ కొండ అంచులో, కొద్దిదూరంలో నాలుగు పిల్లులు కనుపించాయి వాటివంక చూపించాడు రవివర్మ వాటివైపు నడిచారు ఇద్దరూ ఆసక్తిగా కొంచెందూరం వెళ్ళగానే పిల్లులలా కనిపించలేదు అవి

వాటి వంటిమీద అస్పష్టంగా కనిపించే నల్లటి చారలు, మీసాలు, కళ్ళు చూడగానే ప్రతిమ రవివర్మ చేతిని పట్టుకుని లాగింది అదేసమయంలో పెద్దగా వినిపించింది పులిగాండ్రింపు దూరంనుంచి

పులి పిల్లలు అవి!

ఇద్దరూ గాం్రడింపు వినిపించిన వైపు కాక, రెండోవైపు కాలి సత్తువకొద్దీ పరిగెత్తారు

# 15

రవివర్మ, ప్రతిమ నెమ్మదిగా నడుస్తున్నారు, చేతిలో చెయ్యివేసుకుని, పార్క్‌లో విహారానికి వచ్చిన కొత్త దంపతుల్లా

రవివర్మ చెట్ల బోదెలవంక చూస్తున్నాడు పరీక్షగా చెట్ల బోదెలకి తుమ్మ జిగురు తయారయివుంది వాటివెంబడి నడుస్తున్నకొద్దీ రెండు మూడు రోజుల క్రితం పెట్టిన గాట్లు కనిపించసాగాయి చెట్లకి

అడుగువ్యాసంలో ఆ పెద్దపెద్ద వృక్షాల బోదెలను చెక్కేసారు వులితో, తుమ్మ జిగురుకోసం తుమ్మ చెట్లు, సర్వే చెట్లు, మద్దిచెట్లు, వేపచెట్లు, అనేకరకాల చెట్లూ అంటే మనుష్యులు వచ్చి వెళ్ళారు అక్కడికి

మనుష్యులెవరయినా కనబడచ్చని రవివర్మ నడుస్తున్నాడు ఆ చెట్లగాట్లు, కొంతదూరం నడిచాక, ఆరోజే చేసినంత తాజాగా కనిపించాయి

ఉత్సాహంగా నడవసాగాడు, ప్రతిమ చేతినిపట్టి లాగుతూ, మనుష్యులు కనబడా లని భగవంతుణ్ని మనసులోనే ప్రార్థిస్తూ

పావుగంట తర్వాత రవివర్మ బయటకి వచ్చాడు అనుకోకుండా, హఠాత్తుగా మూడు, నాలుగు రోజులనించి రవివర్మ కోరుకున్నట్లుగా, అడవిలోంచి బయటకి వచ్చాడు రవివర్మ నమ్మలేక చూస్తూ నిల్చుండిపోయ్యాడు.

ఎదురుగా మళ్ళీ చెట్లవరస

ఆ చెట్ల వరసకీ, రవివర్మ నిల్చున్న చోటుకీ మధ్య, అరవై అడుగుల వెడల్పున తారురోడ్డు తారురోడ్డుకి ఆనుకుని అవతలివైపు టెలిగ్రాఫ్ స్థంభాలు

ఎండకి మెరుస్తోంది తారురోడ్డు

"హుర్రే ఎట్ లాస్ట్" అన్నాడు రవివర్మ ఆనందంగా- ప్రతిమని గాల్లోకి ఎత్తి తిప్పాడు గిరగిరా కాని ప్రతిమ కళ్ళలో ఏమాత్రం సంతోషం కనపడలేదు రవివర్మకి దిగులుగా వున్నాయి

"ఏయ్ డింప్లీ బయటపడ్డాం ఇక మనం క్షేమం ఏ కారో, లారీయో వస్తే ఆపేద్దాం" అన్నాడు

ప్రతిమ మౌనంగా వుండిపోయింది ఎప్పటిలాగే

"ఏం? దేనికి దిగాలుగా వున్నావ్?" అడిగాడు రవివర్మ ప్రతిమని, చూపుడు వేలిని గడ్డంకింద వుంచి, వేలితో ముఖాన్ని పైకెత్తుతూ

ప్రతిమ కళ్ళు చూసాయి రవివర్మ కళ్ళలోకి దిగులుగా, దీనంగా, అన్నీ కోల్పోయినవాటిలా చూసాయి విచలితుడయ్యాడు రవివర్మ ఆ చూపులకి

"హెలో బేబి హుషారుగా వుండు" అన్నాడు ఆ కళ్ళని ముద్దుపెట్టుకుని




ప్రతిమ ప్రతిమలాగే నిల్చుంది కదలకుండా, రవివర్మ చేతిని వదలకుండా, పట్టు మరికా స్త బిగిస్తూ

"ఏ వెహికల్ వచ్చినా ఆపేస్తాను వెనక్కివెళ్ళి మా వాడితో చెప్పు జరిగిందంతా ఏం? ఖంగారుపడుతుంటాడు ఇంటికి చేరగానే వెంటనే వుత్తరం వ్రాయలేనని చెప్పు నాన్నగారు పెళ్ళంటూ గొడవచేస్తుంటారు ఒకప్రక్క ఆ ఇంపోర్ట్, ఎక్స్‌పోర్ట్ వ్యాపారంలోకి నన్ను లాగాలని ప్రయత్నిస్తున్నారు నా కివేంపట్టవు తెలుసా? నో అటాచ్ మెంట్స్ ఐ వాంట్ బి కేర్ ఫుల్ పెళ్ళికి నిన్ను తప్పకుండా పిలుస్తాలే మేమ్‌సాబ్ "

ప్రతిమకి అర్థంకాని భాషలో, అనవసరమయిన విషయాలన్నీ గబగబా చెప్పుకుపోతున్నాడు రవివర్మ ఆ రోడ్‌ని చూడగానే సంతోషం పట్టలేకపోతున్నాడు అసలా అడవిలోంచి ప్రాణాలతో బయటపడతాననే నమ్మకం నశించిపోయింది రవివర్మకి

ప్రతిమ ఇంకా అలాగే నిలబడి చూస్తోంది ఏంచేయాలో తెలియనిదానిలా

"థాంక్యూ బేబి నీకు చాలా శ్రమిచ్చాను ఇక వెళ్ళు వెళ్ళి చెప్పు "

ప్రతిమని వెనక్కి వెళ్ళమన్నట్లుగా సౌంజ్ఞచేసాడు తిరిగి కేంప్‌కి వెళ్ళిపోతున్నట్లుగా సౌంజ్ఞ చేసాడు

ప్రతిమ కదలలేదు

దూరంగా ఏదో బండి వస్తున్న చప్పుడు వినిపించింది ఆ శబ్దం దగ్గరవసాగింది క్రమంగా

"బండి ఏదో వస్తోంది." అని రవివర్మ రోడ్డుమీదకివచ్చి, జేబురోంచి రుమాలు వూపసాగాడు ఆపమన్నట్లుగా

రవివర్మకి పదిగజాల ముందు ఆగిందో తెల్లటి ఓక్స్ వేగన్ లోపల డ్రయివింగ్ వీల్‌ముందు కూర్చునున్న అమెరికన్ పరీక్షగా చూసాడు వింతగా కనబడుతున్న రవివర్మ వంక

మాసిపోయి, చిరిగిపోయిన బట్టలు, వంటినిండా ముళ్ళు గుచ్చుకున్న గుర్తులు, గుహలో అంటిన బూజు, పెరిగిన గడ్డం, నీరసంగా కనిపించే ఆకారం, పొగ చూరి నట్లుగా వున్న బూట్లూ వింతగా వున్నాడు

"ఎవరు నువ్వు? ఏం కావాలి?" అడిగాడు ఆ ముసలతను గేర్ మారుస్తూ

"మైసూర్ వైపు వెళ్తున్నారా?" అడిగాడు రవివర్మ ఇంగ్లీష్‌లోనే బిగ్గరగా

"అవును"

"నాకు లిఫ్టు ఇస్తారా?"

"ఇక్కడికి ఎలా వచ్చావ్?"

"కాలి నడకన"

"ఎక్కడ నుంచి?"

"అడవిరోంచి"

ఆ ముసలతని ప్రక్కన కూర్చుని వున్న అమెరికన్ యువతి ఆశ్చర్యంగా చూసింది, రవివర్మ వంక, అతని ఆకారం వంక

"అడవిలోంచా?" అడిగింది గట్టిగా

"అవును నాలుగు రోజులనుంచి అడవిలోనే దారికోసం తిరుగుతున్నాను"

"కమాన్ మై బాయ్" అన్నాడతను

"ఒన్ సెకండ్"

రవివర్మ చెట్ల చాటున నిల్చుని వున్న ప్రతిమ దగ్గరకు వెళ్ళాడు రోడ్డు దాటి రెండు భుజాల మీద చేతులు వేసి అన్నాడు, కళ్ళలోకి చూస్తూ

"గుడ్‌బై ప్రతిమా"

ప్రతిమకి అర్థమయింది జరగబోయేది అది తనకిష్టం లేదని చెప్పాయి ప్రతిమ కళ్ళు ఆడవాళ్ళు చెప్పేవిధంగా, ఎఫెక్టివ్‌గా, ప్రపంచంలో ఏమూలవాడికయినా, ఏ భాషవాడికయినా అర్థం అయేలా చెప్పాయి ఆ కళ్ళు

నీళ్ళు కార్చాయా కళ్ళు ఏడుస్తోంది.

ప్రతిమ ఏడుస్తోందని గ్రహించి కొద్దిగా ఆశ్చర్యపడ్డాడు రవివర్మ రెండు చేతులతో కన్నీళ్ళు తుడుస్తూ అన్నాడు

"ఛ ఛ ఏడవక మళ్ళీ ఎప్పుడైనా వస్తాగా"

రెండడుగులు వెనక్కి వేసాడు

చటుక్కున ఆగిపోయాడు, 'డింప్లీ' అన్న మాట విని

మాట్లాడుతోంది ప్రతిమ మాట్లాడుతోంది గబగబా మాట్లాడుతోంది అంత దాకా 'డింప్లి' అన్న మాట మాత్రమే, ఆ మూడు రోజులు కలసి పది, పన్నెండు సార్లు మాత్రమే 'డింప్లీ' అన్న మాటను వుచ్చరించిన ప్రతిమ, వూపిరి తీసుకోకుండా గబగబా చెప్తోంది రవివర్మకి అర్ధంకాని కోయ భాషలో

కారు హారన్ వినబడింది

"ఓ ప్రతిమా, నన్ను వెళ్ళనీయ్" అన్నాడు ప్రతిమ చేతులు విడిపించు కుంటూ

ప్రతిమ వదలలేదు రవివర్మని

బలవంతంగా వదిలించుకుని పరిగెత్తాడు రోడ్డు మీద కారు వైపు వెనకే పరుగెత్తుకొచ్చింది ప్రతిమ. కారు తలుపు మూసి అన్నాడు రవివర్మ ఆశ్చర్యంగా చూస్తున్న ఆ అమెరికన్ దంపతులతో

"పోనివ్వండి"

"ఎవరా పిల్ల?" అడిగాడు ముసలాయన పోనిస్తూ

"మార్గదర్శి" చెప్పాడు

ఓక్స్ వేగన్ కొద్దిగా వేగం అందుకుంది దానివెంట పరిగెత్తుతూ ప్రతిమ ఏదో చెప్తోంది ఏడుస్తూ క్రమంగా ప్రతిమ అందుకోలేనంత వేగంగా పోతోంది ఓక్స్‌వేగన్

"డింప్లీ"

అడవి అంతా ప్రతిధ్వనించేలా అరిచింది ప్రతిమ ప్రతిమ అంత గట్టిగా అరవగలదని అనుకోలేదు రవివర్మ ఎప్పుడూ.

'డింప్లీ' మళ్ళీ అరిచింది గట్టిగా

మలుపు తిరుగుతూంటే చూసాడు రవివర్మ కిటికీలోంచి వెనక్కి మోకాళ్ళ మీదకి వాలిపోయి, ముఖంలో చేతులు వుంచుకుని ఏడుస్తోంది ప్రతిమ రోడ్డుమీద ఒంటరిగా

చిన్నగా నిట్టూర్చాడు

పేంట్ జేబులోంచి తడిసిపోయిన రూపాయ నోట్లని తీసి సీట్ మీద పరిచాడు ఆరడానికి అప్పుడు గ్రహించాడు రవివర్మ నిశ్శబ్దంగా తనని వాళ్ళిద్దరూ గమనిస్తు న్నారని.

"హలో, నా పేరు రవివర్మ కలకత్తా నుంచి వచ్చాను" చెప్పాడు రవివర్మ నవ్వుతూ

"మిస్టర్ అండ్ మిసెస్ హేరింగ్టన్ జూలాజికల్ సర్వే నిమిత్తం వచ్చాం, ఫ్లోరిడా, అమెరికానుంచి"

''థాంక్‌గాడ్! మీరు కనబడకపోతే, లిఫ్ట్ ఇవ్వకపోతే ఇబ్బంది పడేవాణ్ని మైసూర్ చేరాక, ముందర ట్రంక్‌కాల్ చేయాలి ఇంటికి ఈ మూడు రోజులు ఎన్ని ఇబ్బందులు పడ్డానో చెప్తే నమ్మరు మీరు పులులు, ఏనుగులు, బాణాలు, విషాలు, పాములు, దావానలం గాడ్ గాడ్ బ్రతికి బయటపడ్డాను''

కారు చెక్‌పోస్ట్ ముందు ఆగింది చెక్‌పోస్ట్ అధికారులు వాళ్ళ పర్మిట్స్, ఇతర కాగితాలు చెక్ చేస్తూంటే, రవివర్మ కర్నాటక, తమిళనాడు సరిహద్దుల్లో వున్న కోతులవంక, 'థాంక్స్ విజిట్ ఎగెయిన్' అని వ్రాసివున్న తమిళనాడు రాష్ట్ర సైన్‌బోర్డ్ వంక, 'వెల్ కమ్ టు కర్నాటక' అని వ్రాసివున్న కర్నాటక రాష్ట్ర సైన్ బోర్డు వంక చూసాడు

కారు వూటీ, మైసూర్ ఘాట్ రోడ్‌మీద, తమిళనాడు రాష్ట్రంలోంచి కర్నాటక రాష్ట్రంలోకి ప్రవేశించింది, అడ్డుగా వున్న బారియర్ తీయగానే

''మైసూర్‌కి ఎప్పుడు చేరుతాము?'' అడిగాడు రవివర్మ వాళ్ళని

సమాధానం, చెప్పి కొన్ని క్షణాల తర్వాత అడిగాడు ఆయన

''నీ పేరు రవివర్మా?''

''అవును''

''అయితే 'డింప్లీ' అంటే అర్ధం ఏమిటి?

''డింప్లీ''

''అవును డింప్లీ''

''డింప్లీ నాకు తెలియదు''

# 16

వర్షాకాలంలో, ఓ రోజు కలకత్తాలోని ఓ ఖరీదయిన ఇంట్లోంచి అప్పుడే కారులోంచి బయటకి వెళ్తున్న రవివర్మకి ఎదురుపడ్డాడు పోస్ట్‌మేన్ గేట్‌కున్న పోస్టు బాక్స్‌లో వుత్తరాలు వేయకుండా, వాటిని డ్రయివింగ్ సీట్‌లో కూర్చుని వున్న రవివర్మకి అందించాడు పోస్టుమేన్

రవివర్మ కారు ఇంజన్ ఆపేసి, రెండు వుత్తరాల వంక చూసాడు ఒకటి తనది రెండోది భార్యది భార్యకిచ్చేసాడు ఆ వుత్తరాన్ని

క్రొత్తగా పుట్టింటినుంచి కాపరానికి రావటంవల్ల, తలిదండ్రుల దగ్గరనుంచి చాలా తరచుగా వుత్తరాలు వస్తున్నాయి రవివర్మ భార్యకి

రెండోది తమిళనాడు రాష్ట్రంలో, వూటీకి ఎనభై మైళ్ళ దూరంలో వున్న తన మిత్రుడు, ఫారెస్టు రేంజర్ వ్రాసిన వుత్తరం

చింపి, కాగితం బయటకి తీసాడు రవివర్మ ఆతృతగా చాలా వారాలనుంచి ఆ వుత్తరం కోసమే ఎదురు చూస్తున్నాడు రవివర్మ

కేంప్ డి/11.

డియర్ రవివర్మ,

నీ వుత్తరం, శుభలేఖ అందాయి కంగ్రాట్స్ ఎండ్ ఆల్ ది బెస్ట్

నీ వుత్తరంలోని రెండో పేరా ప్రతిమకి యీ అడవులన్నీ కొట్టిన పిండి బాగా తెలుసు నిజానికి అంగుళం అంగుళం కూడా తెలుసంటే అతిశయోక్తి లేనంతగా తెలుసు అడవిలో మీ ఇద్దరినీ కలిపి ఎక్కడ వదిలినా, ఒక్కపూటలో బయటికి తీసుకురాగలదు

నిజానికి ప్రతిమ తప్పనిసరిగా అలాగే తీసుకురావాలి నీకు తెలియని ఓ సంగతి, నీకు ఆసక్తిగా వుంటుందని వ్రాస్తున్నాను వీళ్ళలో ఓ సాంప్రదాయం గురించి నీకు చెప్పివుంటే ఎంతో బావుండేదని ఇప్పుడు విచారపడుతున్నాను

పెళ్ళయిన మొదటి మూడు రోజులూ—ముఖ్యంగా మూడు రాత్రులు ఎవరికీ కనపడకుండా గడుపుతారు వంటరిగా పెళ్ళయినదన్న దానికి చిహ్నం అది ఒకవేళ పరాయిపురుషుడితో, వీళ్ళ జాతికన్య, మూడు రాత్రులు వరుసగా పెళ్ళి కాకుండా గడిపితే, ఆ కన్యకు, ఆ పురుషుడికి పెళ్ళయినట్లు గుర్తు మూడోరాత్రి మధ్యలోనో, ఇక రెండు మూడు గంటల్లో సూర్యుడుదయిస్తాడనంగానే ఆ కన్య తిరిగి వచ్చినా పెళ్ళి కానట్లే లెక్క

విచిత్రంగా లేదూ॰ ప్రతిమ మనసు గ్రహించలేకపోయావనిపించింది అంతా అయాక నీకు పెళ్ళయిపోయింది కనుక, ఇక 'డింప్లీ' అన్న మాటకి అర్థం వ్రాయటంలేదు నీకు ఇక పూర్తిగా అనవసరం కాబట్టి ముందరే తెలుస్తే మరోలా వుండేదేమో॰

మరో ముఖ్యమయిన సంగతి ప్రతిమ నీకు త్వరలో కూతురో, కొడుకో అందించబోతోంది, అందుకోడానికి నీకు ధైర్యం చాలినా, చాలకపోయినా

యువర్స్ సిన్సియర్లీ

వూపిరి పీల్చడం కూడా చేతకాలేదు రవివర్మకి వుత్తరం పూర్తవగానే. నివ్వెరపోయి చూస్తూండిపోయాడు ఆ వుత్తరం వంక

ఒంట్లోని రక్తం అంతా గుండె దగ్గరికి చేరి, అక్కడే ఆగిపోయినట్లుగా ఫీల్ అయ్యాడు రవివర్మ గుండె బరువెక్కింది

మృదువుగా భర్త భుజంమీద చెయ్యివేసి అడిగింది రవివర్మని అతని భార్య

"ఎందుకలా అయిపోయారు॰ ఎవరు వ్రాసారు॰ ఏం వ్రాసారు॰"

— సమాప్తం —

# ముచ్చటైన ప్రేమకథ



చందు సోంబాబు

పేరు పద్మజ వయసు ఇరవై రెండు చదువు మెడిసిన్ రంగు పసిమి ఛాయ అందంలో అజంతా శిల్పం

సన్నం, పొడుగు, కోలమొహం, నొక్కుల జుట్టు, ఖరీదైన చీర, మాచింగ్ కలర్ బ్లౌజు, పల్చని ఆకు చెప్పులు, మెళ్ళో సన్నని గొలుసు, చెవులకి పెద్ద రింగులు, ఒక చేతికి రిస్ట్‌వాచీ, మరో చేతికి రెండు బంగారు గాజులు ఇదీ పద్మజ రూపం

కారుంది బెజవాడలో రెండు మేడలూ, హైద్రాబాద్‌లో రెండు మేడలూ వున్నాయి బ్యాంకులో డబ్బు ఎంతుందో తెలీదు. భూములున్న మారాజు, ఆదరాల తల్లితండ్రి

పేరు రంగనాథరావు వృత్తికి కంట్రాక్టరు

ఇద్దరే కూతుర్లు పెద్ద పిల్ల సుమతి డాక్టరు పెళ్లయింది

రెండోది పద్మజ ఖరీదైన మనిషి కడుపున పుట్టడం ఆడపిల్లకి ఏ జన్మల్లో చేసుకున్న పుణ్యాకారణం అని నా నమ్మకం. కారుందని పద్మ చెప్పదు కార్లో షికార్లు కొట్టదు స్నేహితులంటే వల్లమాలిన ప్రేమ అంచేత వాళ్ళతో కలిసి సిటీ బస్సుల్లోనే తిరుగుతుంది సరిగ్గా పద్మజని నేను మొదటిసారి ఎర్రమంజిల్ దగ్గర బస్సులోనే చూసేను పద్మజని ఒకసారి చూస్తే చూపుని తిప్పుకోడం అంత తేలికైన విషయం కాదు పద్మజ వేపు దిక్కులు చూస్తూ బస్సు డ్రైవరు బస్సు నెక్కడ గుద్దిపారేస్తాడో అనిపించి భయ

పడిన మాట నిజం  పద్మజని చూసేక ఆ పిల్ల గురించి నేను విన్నదంతా నిజమే అనిపించింది

మా ప్రసాద్ పద్మజ వెనుక ఎందుకు పడుతున్నాడో కూడా అర్థం అయింది ప్రసాద్ మా అన్నయ్య కొడుకు బి ఏ ఫైనల్ చదువుతున్నాడు పద్మజ ఎక్కడుంటే ఆ పరిసరాల్లోనే వుంటాడని విన్నాను ప్రేమించడం తప్పని నా ఉద్దేశం కాదు

ఆ మాటకొస్తే నేను రాసినవన్నీ ప్రేమ కథలే అయితే నాకున్న అభిప్రాయం ఒక్కటే అసలు ప్రేమించకూడదు ఒకవేళ ప్రేమించినా ఆ ప్రేమ సుఖాంతం కారాదు నిజ జీవితాల్లో ప్రేమ పెళ్ళిళ్ళు నూటికి తొంభయి తొమ్మిది ఫెయిలవుతాయని నా నమ్మకం

నిజానికి మా వాడికీ పద్మజకీ మధ్య ఆకాశానికీ భూమికీ మధ్య వున్నంత తారతమ్యం వుంది

తోటరాముడ్ని రాజకుమారి వరించిన సందర్భాలున్నాయి కానీ పద్మజ మావాడ్నేమీ ప్రేమించలేదు తన వెంటపడే ఓ పోకిరీగాడనే అభిప్రాయం వుంది అతను రాసిన ఓ అరడజను ప్రేమలేఖల్ని చూస్తుండగానే చించిపారేసిందని ప్రసాద్ ఫ్రెండ్ సురేష్ నాకు చెప్పాడు అసలు పద్మజ గురించి నాకు చెప్పింది కూడా సురేషేను

అప్పుడు మావాడ్ని నిలదీసి అడిగాను. ప్రసాద్ నీకంటే ఏడేళ్ళు చిన్నవాడు అంచేత నా దగ్గర ఓ ఫ్రెండ్‌లా వుంటాడు అన్నకొడుకు గనక వాడు నేనంటే భయపడి అణగి మణగి వుండాలని నేను ఎప్పుడూ అనుకోను

ప్రసాద్ నా మాటల్ని తేలిగ్గా కొట్టిపారేసి అన్నాడు

"నీ కెవరో కట్టుకథ చెప్పారు బాబాయ్! భలేవాడివి నేను ప్రేమించడమేమిటి? నయం ఇంకా ఈ సంగతి అమ్మకి చెప్పావు కాదు," అన్నాడు

నేను వృత్తిరీత్యా లాయర్ని వాడు నాకు అబద్ధం చెప్పడం నా క్కొంచెం కష్టం కలిగింది వాడ్ని బుజ్జగించి అడిగేను

"ఫర్లేదు ఇదేమీ నేరం కాదు నువ్వు నిజం చెబితే నా సహకారం నీకుంటుంది" అన్నాను వాడితో ఎలా మాట్లాడితే నిజం చెబుతాడో నాకు తెలుసు

ప్రసాద్ కొద్దిసేపు తలొంచుకున్నాడు గోళ్ళు కొరికాడు నాకేసి అదోలా అనుమానంగా చూసేడు ఆఖరికి అన్నాడు

"నిజమే బాబాయ్! నేను పద్మజని బాగా లైక్ చేస్తాను" అన్నాడు.

"ఒట్టి లైకింగేనా? లేక లవ్వా?" అడిగేను

"ఏమో? అదేమిటో నాకు తెలీదు కాని పద్మజని చూడందే మాత్రం నేను వుండలేను" అన్నాడు

"నాకోసారి ఆ అమ్మాయిని చూపిస్తావా?" అడిగేను

నేను పద్మజని అప్పటికే చూశాను. అయితే అది వాడికి చెప్పలేదు నేను

"పద్మజకి నువ్వు బాగా తెలుసు" అన్నాడు

"ఎలా?"

''నీ కథలంటే చాలా ఇష్టం పద్మజకి ''

ఆ మాట వినగానే నాకు ఏనుగెక్కినంత సంబరం కలిగింది రచయితలు అల్పసంతోషులని నాకు తెలుసు ఎవరైనా మేము ఏ చెత్త రాసినా బాగుందంటే వాడి ముక్కు మొహం తెలీకపోయినా కూర్చోబెట్టి కాఫీ యిచ్చి పంపందే తోచదు అందునా పద్మజ లాంటి అందాలరాసికి నా కథలంటే ఇష్టం అని విన్నప్పుడు వంద ములగ చెట్లెక్కిపోయినా ఆశ్చర్యం లేదు

''ఆ విషయం నీకెలా తెలుసు?'' అడిగేను

ప్రసాద్ నవ్వాడు

''పద్మజ విషయాలు ఎప్పటి కప్పుడు నాకు తెలుస్తాయి. సంగీతం మాష్టారబ్బాయితో అందిట ''

''పాటలు కూడా పాడుతుందా!'' అడిగేను

''రేడియోలో కూడా పాడింది'' అన్నాడు

ప్రసాద్ భుజం తట్టి చెప్పాను

''నువ్వేం దిగులుపడకు మిగిలిన విషయాలు నేను చూసుకొంటాను కానీ ఓ షరతు ఆ పిల్లకి నువ్వంటే ఇష్టమైతే నే సహాయం చేస్తాను లేకపోతే నువ్వికఆ ఛాయలకి కూడా వెళ్ళకూడదు'' అన్నాను

''అలాగే'' అన్నాడు ప్రసాద్

తర్వాత వాడు వెళ్ళిపోయాడు

ప్రసాద్ నా అన్న కొడుకు వాడి బాగోగులు చూడవలసిన అవసరం నా పైన లేకపోలేదు ప్రసాద్ ఫ్రెండ్ గోపీ వున్నాడు గోపీ మాటలు చెప్పినంతగా ఏ పనినీ చేతల్లో చేసేరకంకాదు మా వదిన దగ్గర వున్నదీ లేనిదీ పోగు చేసి ప్రసాద్ గురించి చెప్పాడు దాంతో ఆవిడగారు కంగారుపడిపోయి నన్ను పిలిపించి,

''చూడ్నాయనా, వాడు మాకెంతో నీకూ అంతే; మా మాటకంటే నీమాటే వింటాడు ఎలాగైనా ఆపిల్ల వెనుక తిరక్కుండా చూడు'' అని బ్రతిమిలాడింది వదినకి మేనకోడల్ని కోడలిగా చేసుకోవాలని కోరిక వదినకి అలాగే అని హామీ ఇచ్చాను ఆవిడిచ్చిన కాఫీ తాగి బయట పడ్డాను

కోర్టుకి శెలవలు వచ్చేవాళ్ళు కూడా లేకపోవడంతో నాకు తీరుబడి ఎక్కువై పోయింది

తోచని వ్యవహారంగా ఇందులో ప్రవేశించాను ఇప్పుడిదో పెద్ద హెడేక్ అయిపోయింది వదినకి తెలీనంతవరకూ ఓలా వున్న విషయం ఇప్పుడు చిక్కులో పడిపోయింది ప్రసాద్ తరపున వకాల్తాపుచ్చుకొని ఏమన్నా చేస్తే నన్ను, అన్నయ్యా, వదినా వుతికి పారేస్తారు అలా కాకపోతే ప్రసాద్‌గాడు ఏడుస్తాడు పైగా వాడసలే ముక్కోపి వాడికెమన్నా ఓ పని చేద్దామని కనక అనిపిస్తే ఆ పనిని చేసేవరకూ నిద్రపోడు తగ్గట్టుగా వాడి నేస్తాలందరూ కూడా దాదాలే దాదాలంటే నాకు భయమని కాదు ఎలాంటివాడి కొమ్ములైనా విరిచేసే శక్తి నా వృత్తికుంది

ప్రసాద్‌కు నేను మాటిచ్చాను దాంతో




అతని స్నేహితులు నా దగ్గరికి రాక పోకలు ఎక్కువ చేశారు జనం ఏకారణం చేత వచ్చినా చూసేవాళ్ళకి ప్లీడరనే వాడిల్లు హడావిడిగా కనబడ్డం మంచిది

ప్రసాద్ అసలు కాలేజీకి పోవడం లేదని గోపీ చెప్పాడు మెడికల్ కాలేజీకి ఎదురుగా నిరీక్షణలో గడిపేస్తున్నాడు గంటల తరబడి బస్టాపుల్లో నించోడం, సినిమా హాల్స్ దగ్గర కాపలా కాయడం, రవీంద్రభారతిలో ఏ పాటకచ్చేరి జరిగినా వెళ్ళి హాజరై పోవడం చేస్తున్నాడు

—నాకిది బొత్తిగా నచ్చలేదు

వాడు పాడై పోవడం కళ్ళతో చూస్తూ వూరుకొనేదెలా? వాడు పూర్తిగా పాడై పోక ముందే ఓ దార్లో పెట్టాలని నిశ్చయించుకున్నాను

ఉదయం కాఫీ తాగి పేపరు చూస్తున్నాను

"ప్లీడరుగారున్నారా?" అన్న మాటలకి తలెత్తి చూసేను నా కళ్ళని నేను నమ్మలేకపోయాను

నేను కళ్ళ ముందే ఉన్నా ప్లీడరుగారున్నారా అని అడుగుతుంటే వళ్ళు మండిపోయింది కానీ నేను వయసుకి కుర్రాడ్ని మామూలుగా రోడ్డుమీది కెళితే ఏ కాలేజీ స్టూడెంటో అనుకుంటారే తప్ప లాయర్నని మాత్రం ఎవరూ అనుకోరు

"ప్లీడరుగారితో పనేమిటి?" అడగేను

"కోర్టు పని కాదు" అంది పద్మజ

మిగిలిన ఇద్దరూ కిసుక్కున నవ్వేరు

"మీరేం పని మీద వచ్చారు?" అన్నాను

"వివరాలు మీ కెందుగ్గానీ, ప్లీడర్ గార్ని పిలవండి" అంది

నా వళ్ళు మండింది

"నేనే లాయర్ రావుని" అన్నాను

"మీరా? నయం ప్లీడరుగారంటే మీ నాన్నగారనుకొన్నాను" అంది

"ఇంకా తాతగారనుకోలేదు నమ్మకం లేకపోతే ఆ గోడకున్న ఫొటోకేసి

చూడండి'' అన్నాను

పద్మజ ఫొటోకేసి చూసి నవ్వింది పద్మజ నవ్వినప్పుడు బుగ్గలు సొట్టలు పడ్డాయి

''మీరింత చిన్న వాళ్ళనుకోలేదు'' అంది

''మీకంటే చిన్నవాడ్ని కాదుగా'' అన్నాను

పద్మజ నవ్వింది

''నా మీరు రాసే కథలంటే చాలా ఇష్టం. అందుకని ఓసారి మిమ్మల్ని కలుసుకోవాలని వచ్చాను'' అంది ఆ మాటలకి నేను గాలిలో తేలిపోయాను పద్మజ ప్రసాద్ ప్రియురాలన్న సంగతి కూడా మర్చిపోయాను

''కేవలం చూడ్డానికే వచ్చేరా?'' అడిగాను

పద్మజ కాస్త సిగ్గుపడింది తర్వాత అంది

''నాకూ కథలు రాద్దామనుంది మీరు రాసిన కథలు దాదాపు అన్నీ చదివేను నాకు నచ్చే కథలు రాసేవారి దగ్గరే శిక్షణ పొందడం మంచిదనిపించింది''

''తప్పకుండా, కానీ ఏ రచయిత్రి దగ్గరో అయితే బాగుండేది'' అన్నాను పద్మజ చురుగ్గా చూసింది ''ఏం మీకు అభ్యంతరమా?'' అంది

''అబ్బెబ్బె' అలాంటిదేమీ లేదు. రాసినవుంటే ఇవ్వండి చూస్తాను'' అన్నాను పద్మజ రెండు కథలిచ్చింది రెండూ వారపత్రికలనుంచి తిరిగొచ్చా యని చెప్పింది పద్మజని చూస్తే వార పత్రికలేవెనక్కొచ్చేస్తాయని నాకు తెలుసు గ్లామర్‌ని పెంచుకొని కథలు రాస్తున్న వాళ్ళు నాకు తెలుసు

''మీ మిసెస్‌ని పరిచయం చెయ్యరా?' అనడిగింది

నేను లోపలికెళ్ళి ఫ్లాస్కులో కాఫీని నాలుగు కప్పుల్లో సర్దించి పని కుర్రాడితో మోయించుకొచ్చాను

''సారీ నాకింకా పెళ్ళి కాలేదు'' అని చెప్పాను

''చాలా శ్రమిచ్చాం సారీ'' అంది పద్మజ

''మరేం ఫర్లేదు వస్తుంటారుగా'' అన్నాను

''మీ శిష్యురాలిగా చేరాక రాక తప్ప దుగా'' అంది

నవ్వేను

పద్మజ వెళ్ళిపోయాక ప్రసాద్ వచ్చాడు వాడి మొహంలో నెత్తురుచుక్క లేదు మాట్లాడకుండా నా ముందు కూర్చు న్నాడు పద్మజ యిచ్చి వెళ్ళిన కథ లందించాను

''నేను చెప్పలా నీ కథలంటే ఇష్టం అనీ'' అన్నాడు

నేను మాట్లాడలేదు.

''నన్ను గురించేమైనా అడిగిందా'' అడిగాడు

''లేదు'' అన్నాను

వాడ్ని చదవాలనిపించింది

''పద్మజ పెళ్ళట'' అన్నాను

ప్రసాద్ బాంబు పడ్డట్లు వులిక్కి పడ్డాడు

''నిజంగానా?'' అడిగాడు

''నిజమే'' అన్నాను




పిడికిలి బిగించి అన్నాడు

‘‘పెళ్ళి పందిరికి నిప్పు పెట్టి పద్మజని ఎత్తుకెళ్ళిపోతాను’’ అన్నాడు

‘‘రాజుల కాలం కాదిది కేసు పెట్టి జైల్లో పారేస్తారు’’ అన్నాను

‘‘పద్మజ నాదికాకపోతే తనని చంపి, నేను ఛస్తాను అంతేకానీ మరొకళ్ళకి మాత్రం పద్మజని దక్కనివ్వను’’ అన్నాడు

‘‘అలా స్లేరప్ అవకు కిడ్నాప్‌చేసి తీసికెళ్ళినంత మాత్రంచేత ఆ పిల్ల నీకు లొంగిపోతుందా? అది పెద్ద నేరం కూడానూ’’

‘‘ఇష్టమై వచ్చిందని చెప్తాను’’

‘‘పద్మజ మేజర్ రిపోర్టు చేస్తుందనుకో’’

ప్రసాద్ నాకేసి విసుగ్గా చూశాడు

‘‘అందుకే నీ సహాయం అడిగింది నాకివన్నీ తెలియవు ఇప్పుడు నన్నేం చెయ్యమంటావ్?’’ అన్నాడు

‘‘శాంతంగా ఉండు పద్మజ పెళ్ళి మాట అబద్ధం’’

ప్రసాద్ శాంతించాడు వాడి తత్వం నాకు బాగా తెలుసు వదిన గారాభం ఎక్కువ చెయ్యడంచేత మూర్ఖత్వం ఎక్కువైపోయింది నిజంగా పద్మజకి పెళ్ళి జరిగితే అన్నట్టుగానే పెళ్ళిపందిరికి నిప్పు పెట్టగల దిట్ట చిరంజీవి ప్రసాద్

—పద్మజ రాసిన కధలు చదివేను బాగున్నాయి కాస్త గైడ్‌చేస్తే దారిలో పడుతుందనిపించింది రాసేవాళ్ళంటే నాకిష్టం అందునా ఆడపిల్లలు కధలు రాస్తే సరదా ఎక్కువ వాళ్ళకి కావల్సిన ప్రోత్సాహం కూడా ఇస్తాను

పద్మజ మరో రెండు రోజుల తర్వాత ఒంటరిగా వచ్చింది

‘‘మిలట్రీ తోడు లేకుండా ఒంటరిగా వచ్చారే?’’ అన్నాను

''ప్రతి విషయం అందరికీ తెలీడం నాకిష్టంగా వుండదు'' అన్నది

''అంటే మీరు కథలు నేర్చుకొంటు న్నారని అందరికీ తెలీకూడదా'' అన్నాను

పద్మజ సన్నగా నవ్వింది పద్మజ నవ్వితే గలగలమని పారే సెలయేరు తుళ్ళిపడినట్టుగా వుంటుంది

''నేను కథలు నేర్చుకోడానికి కాదు వచ్చింది కథలు రాయడం నేర్చుకో డానికి'' అంది ప్రతి మాటనీ సూక్ష్మ దృష్టితో అవగాహన చేసుకొంటుంది పద్మజ పద్మజతో మాట్లాడుతూంటే నాకు బొత్తిగా టైం తెలీదు

''మీ రెండు కథల్ని మాసపత్రికల కిచ్చాను పైనెల్లో పబ్లిష్ అవుతాయ''ని చెప్పాను

''చాలా థ్యాంక్స్ '' అంది

పదిహేను రోజులు గడిచేయి అప్ప టికి నాలుగుసార్లొచ్చింది పద్మజ ఎప్పటి కప్పుడు ప్రసాద్ విషయం ప్రస్తావించాలి అనుకొంటూనే అశ్రద్ధ చేసాను ప్రసాద్ సతాయింపు ఎక్కువైంది

''దాబాయ్ నువ్వేదో నాటకం ఆడుతు న్నావ్. పద్మజ ఇన్నిసార్లు వచ్చినా నువ్వేం మాట్లాడలేదంటే నిన్ను గురించి నేను ఏమనుకోవాలి? నీ లాయర్ తెలివి నా దగ్గరొద్దు దయచేసి త్వరగా విషయం తేల్చేయ్'' అన్నాడు సిగరెట్ వెలిగించి అన్నాను

''నువ్వింకా కుర్రాడివి చదువుకొంటు న్నావ్ ఉద్యోగం లేదు పద్మజ నువ్వంటే ఇష్టపడి వచ్చేసినా ఆ పిల్లని పోషించే శక్తి నీకుండాలి ప్రేమకి మనసుంటుంది కానీ పోషించలేదు ''

నా మాటలు వాడి చెవి కెక్కలేదు ''అసలు నీ సహాయం అడగడం నాదే తప్పు,'' అన్నాడు ఆఖరికి

''తొందరపడకు నన్నర్థం చేసుకో'' అన్నాను ప్రసాద్ రోషంగా చూశాడు ప్రసాద్ స్వతహా తెలివైనవాడు ప్రేమ విషయంలో ఇన్ని అవలక్షణాలెలా ఏర్ప డ్డాయో బోధపడలేదు

పద్మజ కథలు అచ్చయ్యాయి ఆ రోజున పద్మజ ఫోన్ చేసింది తన బర్త్ డే అని, తన ఫ్రెండ్స్‌కి నన్ను చూపిస్తా నని ప్రామిస్ చేశాననీ చెప్పింది నేను బయలుదేరబోతూండగా క్లైంట్స్ వచ్చారు మా సీనియర్ వూళ్ళో లేకపోవ డంతో వాళ్ళతో కూర్చోక తప్పిందికాదు ప్రతిక్షణం పద్మజ ఆహ్వానం గుర్తు కొస్తున్నా కదల్లేకపోయాను మర్నాడు పొద్దున ఫోన్ చేశాను నా గొంతు గుర్తు పట్టి వెంటనే ఫోన్ పెట్టేసింది పద్మజకి నా మీదచాలా కోపం వచ్చిందని గ్రహిం చాను పద్మజ వాళ్ళింటికి వెళ్ళి నచ్చ చెప్పాలనిపించింది నిజానికి ఆ పిల్ల విషయంలో నాలో బలహీనత ఏర్పడి పోతోంది మూడు రోజుల తర్వాత పద్మజే వచ్చింది

"కోపం పోయిందా" అడిగేను

"మీ మీద కోపం వస్తే మాత్రం నేనేం చెయ్యగలను గనుక" అంది

"అంటే ఏమన్నా చెయ్యాలనుందా" అన్నాను ఛలోక్తిగా

"చాల్లెండి పెద్ద" అంది తోటలో కూర్చున్నాం పద్మజకి ప్రసాద్ గురించి




పూసగుచ్చినట్టు చెప్పేశాను అంతా విని పద్మజ నవ్వింది

"ఎండా, వానా ప్రమేయం లేకుండా నేను నవ్వితే చాలు వెనకపడొచ్చేస్తాడు" అంది

"మీకతనిమీదున్న అభిప్రాయం ఏమిటి?"

"నథింగ్ అల్లరికుర్రాడంతే." అంది

"ప్రసాద్ నీ పిచ్చిలో పడి పాడై పోతున్నాడు"

"బాగుంది నేను నా వెంట పడమని గానీ, పాడైపొమ్మనిగానీ చెప్పలేదే." అంది

"అతను బాగుపడ్డం ఇష్టమేనా?"

"అతను చెడిపోతే నాకేం వస్తుంది?" అంది

"అయితే నాకో సహాయం చెయ్యాలి"

"ఏమిటి?" అడిగింది

"మీరంటే వాడికి విరక్తి కలగాలి"

"ఎలా?"

"చెప్తాను కానీ మీ కోపం రాకూడదు"

"రాదు చెప్పండి"

'మనిద్దరం కలిసి సినిమా కెళ్ళాలి"

పద్మజ ఫక ఫక మని నవ్వేసింది

"సినిమాకా?" అంది

"అవును పరాయి పిల్లని సినిమాకి రమ్మని అడిగితే చెంప ఛెళ్ మంటుంది" అన్నాను

"మీకు నేను పరాయిగా అనిపిస్తున్నానేమోగానీ మిమ్మల్ని నేను మాత్రం గురువుగా భావిస్తున్నాను మీ రెక్కడికి రమ్మన్నా వస్తాను తెలుసా?" అన్నది పద్మజ

"మెనీ థాంక్స్" అన్నాను ఆనందంగా

మర్నాడు మాట్నీకి జమేరుద్ లో 'రెడ్ సన్'కి వెళ్ళాం ప్రసాద్ దూరంగా నించుని మా ఇద్దర్నీ చూశాడు ఆ క్షణంలో వాడికేసి చూడాలంటే చాలా గిల్టీగా ఫీలయ్యాను వాడికి నేను హాత్ ఇస్తున్నానని తెలుసు. వాడెంత బాధ పడ తాడో, ఆ టార్చర్ ఎలా ఉంటుందో నాకు తెలుసు

సినిమా జరుగుతున్నా మనసు తెర పైకి పోడంలేదు మధ్య మధ్య భుజం నాకు తగులుతోంది ఆ క్లాసులో జనం ఆట్టేలేరు చీకటిలో పద్మజని చుట్టేసి గట్టిగా ముద్దు పెట్టుకోవాలనిపించింది కానీ అంతసాహసం చెయ్యలేకపోయాను ఆడదంటే ఏమిటో తెలిసిన బ్రహ్మచారిని నేను నాకు చాలా మంది ఆడపిల్లలతో స్నేహం వుంది మనసు పైత్యగించినా నాకుగా నేను చొరవ చెయ్యను అటు నుంచి రెస్పాన్స్ వస్తేగానీ అసలు కధలో కడుగు పెట్టను పద్మజ నా చేతిమీద కొట్టింది

"అతనెవరు హీరో నెందుకు కొట్టాడు" అని అడిగింది

ఇంగ్లీషు సినిమాలు నేను చాలా 'ఈజీగా ఫాలో అవుతాను అదే హిందీ పిక్చరయితే గొడవలో పడిపోతాను పక్కన కూర్చున్న శీతారామయ్య ఎవ రన్నాగానీ వాడా సన్నివేశం ఏమిటో చెప్పేవరకూ చంపేస్తాను పద్మజకి సమా ధానం చెప్పి తృప్తిపరచాను పద్మజ నవ్వి అన్నది

"పోజు కోసం తీసుకొచ్చారనుకు న్నాను మీకు ఇంగ్లీషు సినిమా ఫాలో కావడం తెలుసన్నమాట" అంది

సినిమా అయిపోయింది బయట ప్రసాద్, సురేష్, సుధాకర్, గోపీ నించున్నారు నన్ను తినేశేలా చూస్తున్నా రని గ్రహించాను.

"అడుగో మీ చిరంజీవి ప్రసాద్ మన మీద దాడి చేస్తాడేమిః" అంది నవ్వుతూ

నేను వాళ్ళకేసి చూళ్ళేదు

ఆటో ఎక్కాం పద్మజ అడిగింది

"ప్రసాద్ నా వెనక పడ్డం మానే వరకూ, మనం ఇలా సినిమాలు చూడా ల్సిందేనా ఆటో లెక్కాల్సిందేనా" అని

"మా వాడు బారిలో పడితే మాత్రం సినిమాలు చూడకూడదా" అన్నాను

"నయం నన్ను మీతో వుండిపొమ్మన లేదు" అంది

నేను నవ్వేను ఇద్దరం తాజ్ లో కాఫీ తాగేం పద్మజ వెళ్ళిపోయింది

ఆ రాత్రి ప్రసాద్ తన జట్టుగాళ్ళతో వచ్చాడు వాళ్ళకి నాపైన తగని కోపంగా ఉందని గ్రహించాను

"నువ్వింత నమ్మక ద్రోహం చేస్తా వనుకోలేదు" అన్నాడు ప్రసాద్

నేను మాట్లాడలేదు సిగరెట్టు వెలి గించి ఎదురుగా ఉన్న హోటల్నుంచి టీ తెప్పించాను మాట్లాడకుండా త్రాగారు సురేష్ అన్నాడు

"మీరు చాలా తప్పు చేశారు బాబాయ్ గారూ"

"ఎన్నన్నా చెప్పండి సార్ కధలు చెప్పి పద్మజని లోబరుచుకున్నారు"

అన్నాడు సుధాకర్ నాకు కోపం వెర్రిగా వచ్చింది

"షటప్ అట్టే మాట్లాడకండి. ఓ పక్క మెడపట్టి బయటికి గెంటుతోంటే చూరు పట్టుకొని వేళ్ళాడినట్టుగా వుంది రౌడీలని అభిప్రాయంతో వున్న ఆ అమ్మాయిని మీలో ఒకడ్ని ప్రేమించమని చెప్పెదెలా? అసలు ప్రేమనేది స్వతహాగా కలగాలి ఒకళ్ళు చెబితే ప్రేమిస్తే అది ప్రేమ కాదు పచ్చి నాన్సెన్స్ అంటాను" అన్నాను

"అయితే ముందు వాడికి మాటెందుకిచ్చారు?" సురేష్ అడిగాడు

"మాట తోపాటు షరతు కూడా ఉంది రెండు వైపులా ఇష్టం వుంటేనే నేను సహకరిస్తానని చెప్పాను పద్మజకి ప్రసాదంటే ఇష్టంలేదు" అన్నాను

"అయితే మిమ్మల్ని ప్రేమిస్తోందా?" అన్నాడు గోపీ నేను నవ్వేను

"నేను అడగలేదు" అన్నాను

"నేను ముందే చెప్పాను కేసు మీ బాబాయి దగ్గరకి తీసుకెళ్ళకని ఆడపిల్లల విషయంలో మీ బాబాయ్‌ది పెద్ద చెయ్యని చెప్తే విన్నావుకాదు" అన్నాడు సుధాకర్ అలా తిట్టి తిట్టి అలసిపోయి వెళ్ళిపోయారు కుర్రాళ్ళంతాను

వదినకి మర్నాడు జరిగినదంతా చెప్పాను మెల్లగా ప్రసాద్‌కు నేను నచ్చచెబుతానని నాకు మాటిచ్చింది వదిన

సాయంత్రం పద్మజ వచ్చింది ప్రసాద్ చేసిన దాడి వివరాలు పద్మజకి చెప్పాను నవ్వింది

"పోన్లెండి కొట్టలేదు" అంది.

"గుండెలా? చెరువా?" అన్నాను

"మీ గుండె చెరువో సముద్రమో నాకు తెలీకపోతే కదా పదండి టాంక్‌బండ్ వరకు పోదాం" అంది పద్మజ

ఆహ్వానంతో బయట కొచ్చాను ఎప్పుడు లేంది పద్మజ కారు సొంతంగా డ్రైవ్ చేసుకొచ్చింది

పద్మజ పక్కనే కూర్చున్నాను కారు మెత్తగా సాగిపోతోంది

"టాంక్‌బండ్ చేరేలోగా ఈ చీటీ చదవండి" అంది

అందులో ఇలా వుంది

రావుగారూ,

నాకు మీ కథలంటే చాలా ఇష్టం కానీ ఇప్పుడు మీరే నా ప్రాణం అని తెలుసుకున్నాను

ఏమంటారూ? అవునా?

మీ

పద్మజ

నాకు బుర్ర తిరిగిపోయింది పద్మజ మొహంలోకి చూశాను పద్మజ దృష్టి రోడ్డు మీద ఉంది

అందం, అందంతోపాటు సిరినీ తీసుకొచ్చే లక్ష్మీదేవిని కాదని ఎలా చెప్పను?

పద్మజ భుజంపైన చెయ్యి వేశాను

కారు పార్కు చేస్తూ పద్మజ నా కళ్ళల్లోకి చూసింది

ఆ కళ్ళల్లో పెళ్ళిపందిరి, పెళ్ళి పందిరిలో పీటలపైన నేను, నా పక్కగా పద్మజ కాస్త దూరంలో ప్రసాద్ వాడి ప్రక్కగా సుధాకర్, గోపీ, సురేష్, మండుతున్న దివిటీలు పట్టుకొని పందిరికి నిప్పు పెడుతూ కనబడ్డారు. ★

# మిస్టర్ సంపత్ ఎం.ఏ

## మాదిరెడ్డి సులోచన

### జరిగిన కథ

సంపత్ కుమార్ ఆదర్శాలున్న వ్యక్తి. తండ్రిలేని అతని కుటుంబానికి అండగా నిలిచాడు శివరాజు గారు. శివరాజు కుమార్తె సునీతి సంపత్ ను ప్రేమించింది. సంపత్ కు ఉద్యోగం ఇప్పిస్తానని మాట ఇచ్చాడు శివరాజు గారు. రామనాధానికి కొడుకు కోళ్ళ ఫారం పెట్టడం ఇష్టంలేదు. సంపత్ కుమార్ రామనాధానికి నచ్చ చెప్పేందుకు ప్రయత్నించాడు. శివరాజు గారి మందులషాపులో జరుగుతున్న అన్యాయం చూసి బాధపడ్డాడు సంపత్. సంపత్ కు మిసెస్ గుప్తా పరిచయమయింది. అతని ఉద్యోగం విషయంలో సాయపడతానంది. మిసెస్ గుప్తా పేరు సీత. సంపత్ కు తన దీన గాధను వినిపస్తూ, తన భర్త నపుంసకుడన్న సంగతీ, తనకు పుట్టిన పిల్లలు ఎవరి వల్లో కలిగారన్న సంగతీ సంపత్ కు చెప్పింది. సంపత్ కు తన ప్రేమను వెల్లడించింది సీత. సంపత్ నిరాకరించి వచ్చేశాడు. ఆమెపై సానుభూతి కలిగింది. సంపత్ ఒక కంపెనీలో కూలీగా చేరాడు. అయితే ఎమ్మే చదివాడని తెలిసి, కూలీలతో హక్కుల పోరాటం జరిపిస్తాడేమోనని ఆ ఉద్యోగంలో నుంచీ తీసివేయబడ్డాడు. శివరాజు గార్ని పోలీసులు అరెస్టు చేశారు అవినీతి నేరారోపణపై. జామీనుపై విడుదలయిన శివరాజు యీ పని సంపత్తే చేయించాడన్న భావం వ్యక్తపరిచాడు. సునీతీ సంపత్ ను అనుమానించింది. సంపత్ మనసు చెదిరిపోయింది. శివరాజు గారి కివ్వవలసిన మూడు వేల రూపాయలు వెంటనే కట్టవలసి వచ్చింది. ఆలోచించి ఆలోచించి సీత దగ్గరకు వెళ్ళాడు సంపత్. డబ్బుకోసం మనసు చంపుకొని సీత కోరిక తీర్చి డబ్బు సంపాదించుదామనుకొన్న సంపత్ కు షాక్ తగిలినట్లుగా సీత నిరాదరణ ఎదురైంది. తనను నీచంగా భావించినందుకు సంపత్ ను తూలనాడింది సీత. శివరాజుగారిపై తానే ఫిర్యాదు చేశానన్న విషయం బాబుద్వారా విన్నాడు సంపత్.

"బాబూ!"

"అవున్నా!" బాబు బాధ పడ్డాడు

"జరిగిపోయిందేదో జరిగిపోయింది సునీతి కోపగించినదాంట్లో తప్పు లేదు నావల్లే జరిగిందని ఆమెకు తెలిసి ఉంటుంది అందుకే అంత కఠినంగా మారిపోయింది" నిట్టూర్చాడు

"పోనీ నేను వెళ్ళి అసలు సంగతి చెప్పనా?"

"వద్దు వద్దురా ఇంకా అపార్థం చేసుకుంటుంది ఒక్క సాయము చెయ్యి డబ్బు తిరిగి ఇవ్వటానికి ఇంకొక్కవారం రోజుల సమయం అడుగు"

"అలాగేరా మీ ఇద్దరిమధ్య ఏదయినా భేదాభిప్రాయము రాలేదు కదా?"

"ఆ విషయాలు నువ్వు మరిచిపో నేను మరిచిపోవాలని అనుకుంటున్నాను ఒక్కటే విషయము గుర్తుంచుకో అప్పు తీర్చటానికి మరొక్కవారము గడువు అడగాలి" సంపత్ నడవడానికి శక్తి లేనట్టు ఒక్కొక్క అడుగు వేస్తూ వెళ్ళిపోయాడు

బాబుకు సంపత్ విషయం ఆలోచించే కన్నా డబ్బు ముఖ్యము అందుకే ఇంట్లోకి వెళ్ళాడు రామనాథం వంటింట్లో పచ్చడి రుబ్బుతున్నాడు మెల్లిగా వెళ్ళి పడక గదిలో దూరాడు చిలక్కొయ్యకు తండ్రి షర్ట్ కనిపించింది జేబులో చెయ్యి పెట్టగానే తాళం చెవులు తగిలాయి అవి తీసుకుని తాళం తీశాడు బీరువాది అంతా వెతికినా డబ్బు కనిపించలేదు కంగారుగా వెతికాడు ఏ క్షణంలోనైనా తండ్రి రావచ్చు డబ్బు కనిపించలేదు గాని చిన్న బుట్ట కనిపించింది గడ్డితో అందంగా అల్లినబుట్ట అది మూత తీశాడు మూడు పేటల చంద్రహారము, చిన్న నానుతాడు, చిన్న చిన్న నగలు యెన్నో కనిపించాయి అన్నీ వదిలి చంద్రహారము జేబులో వేసుకుని, ఆదరాబాదరాగా తాళం వేశాడు వెనుతిరిగి అలాగే నిలబడి పోయాడు రామనాథం నిల్చుని వున్నాడు

"నాన్న న్న "

"అంత కంగారెందుకురా తీసుకుపో అన్నీ తీసుకుపో నేను చాలా మూర్ఖంగా ఆలోచించాను నీవు సంపాదిస్తే ఆ ఒక్క వస్తువు అమరటానికి యెంత అవస్థ అయిందో అర్థం అయ్యేది"

"నేను మళ్ళీ తెస్తాను నాన్నా"

"అంతా తీసుకుపోరా నా కళ్ళు తెరిచావు అడ్డమైన గడ్డి కరిచి సంపాదించిన డబ్బురా" అతను బాధగా నుదురు రాచుకుని వెళ్ళిపోయాడు బాబు తండ్రి బాధకు ఏనాడూ చలించలేదు అందుకే ఈనాడు కూడా 'ఏ ' అని ఒకసారి నాలుక తిప్పుకొని వెళ్ళిపోయాడు

రామనాథానికి తన బాధ వెళ్ళబోసుకునేందుకు అనసూయమ్మ దగ్గరకు వెళ్ళేవాడు అలవాటు ప్రకారము వెళ్ళాడు ఆమె స్పృహలో ఉన్నట్టులేదు సంపత్ కూడా కళ్ళకు చెయ్యి అడ్డం పెట్టుకుని

పడుకున్నాడు మాట్లాడాలనిపించలేదు వచ్చి అరుగుమీద కూర్చున్నాడు రామనాధం పూర్తిగా మారిపోయాడు తను ఏమాశించి కొడుకు కోసము నానాగడ్డి తిని సంపాదించాడు? తనలా కొడుకు ప్రతి పైసాకు కట, కటలాడకూడదని, తను అవమానింప బడ్డట్టు డబ్బులు లేక అవమానింపబడకూడదని రాత్రింబవళ్ళు శ్రమించాడు ఇంత శ్రమ వృధా అయింది కొడుకు దొంగతనానికి వెనుదీయలేదంటే అతని మనసులో అగ్నిపర్వతము బ్రద్ద లవుతూంది. పైపంచతో ముఖం కప్పుకుని బావురుమన్నాడు

"అరే ఏమిటిది మామయ్యా?" ఒయటికి వచ్చిన సంపత్ అడిగాడు

"సంపత్! సర్వనాశనము అయిందిరా నా కొంప మునిగిందిరా " బాబు తీసుకు వెళ్ళిన నగల సంగతి చెప్పాడు

ఇంకో సమయంలోనైతే 'తప్పంతా నీ పెంపకములో ఉంది మామయ్యా' అనేవాడు కాని ఈనాడు అతని నోటి గుండా ఆ మాట రాలేదు.

"ఊరుకో మామయ్యా, వాడికి నేను చెబుతాను" ఎంతో శాంత స్వరంతో అన్నాడు

"యెవరమూ నచ్చచెప్పలేనంతగా దిగ జారిపోయాడురా " అతను కళ్ళు ఒత్తు కున్నాడు

"ఇక అలాంటప్పుడు జీవితమే వాడికి పాఠము నేర్పుతుంది మామయ్యా "

"ఊఁ నాకా ఆశ లేదు ఈరోజుతో శని వదిలిపోయిందని వెళ్ళావు ఉద్యోగము దొరికిందా?"

"ఊఁ " అన్నాడు అవును, కాదు అనలేక రామనాధం ఇంట్లోకి వెళ్ళాడు అతని ముఖం ప్రశాంతంగా ఉంది 'ఒకరి భవిష్యత్తు మనొకరు తీర్చి దిద్దా లనుకోవటం పొరపాటు ' పదే ఎదే అనుకున్నాడు అతను ఆలోచిస్తూ పడు కున్నాడు అతనికి ప్రపంచములోని ప్రతి వస్తువు మీద విరక్తి కల్గింది

## 15

సంపత్ లేచి ముఖం కడుకున్నాడు సీసా దులిపితే టీ అరు దొరికింది టీ కాచి, పంచదార గిన్నెలోకి వంపాడు అందులో అతుక్కుపోయిన పంచదార ఏమయినా ఉంటే టీలో కరుగుతుందని అతని ఆశ ఆ టీని రెండు గ్లాసుల్లో ఒంపాడు తల్లిని లేపితే కళ్ళు విప్పింది గాని నోరు విప్పలేకపోయింది

"అమ్మా! వేడిగా టీ త్రాగు " అన్నాడు

"ఊఁ " లేవటానికి చేతకావటం లేదని సైగచేసింది అతను బలవంతంగా లేపి ముఖం కడిగించాడు టీ త్రాగిస్తే సగమే త్రాగింది సగము అటు, ఇటుగా పోయింది ఆమెను పడుకోబెట్టి తన టీ త్రాగాడు

"ఆ ఆ పట్టీ ఏమిట్రా?"

"చిన్న దెబ్బ అమ్మా" తల్లి మాట్లాడు తుంటే కొండంత ఉత్సాహము వచ్చింది

"ఒ క్క ఒక్క సారి
సు నీ తి ని ర మ్మ ను"
అతి కష్టం మీద అడిగింది

"మంచిదమ్మా " అన్నాడు తను ఏది మరిచిపోవాలని ప్రయత్నిస్తాడో,




అదే గుర్తు చేస్తారు యెందుకో! సునీతి రావటం మళ్ళీ తా మిద్దరము కలవటం సంభవిస్తుందా?

"సంపత్....ఓ సంపత్ బాబూ! నా కొంప మునిగిందయ్యా...." ఏడుస్తూ వచ్చింది. ఆమె గంగారావు భార్య సుశీల.

"ఏమిటి వదినా!"

"ఏమని చెప్పను? మీ అన్నయ్య పుర్రెలతో, యెముకలతో పూజలు చేస్తున్నాడట...." బావురుమంది.

"యెవరు చెప్పారు వదినా?"

"ఆయన రాత్రి ఇంటికి రాకపోతే పెద్దాడిని పంపాను.

ఆయనక్కడ చేస్తున్న నిర్వాకమిదట బాబూ....నీ కాళ్ళు పట్టుకుంటాను, నా సంసారం నిలబెట్టు" ఆమె బావురుమంది. తన బ్రతుకే నిలకడ లేదు. అలాంటప్పుడు మరొకరి సంసారాలు తనెలా నిలబెట్టగలడు? అమాయకులు. నీరసంగా నవ్వుకున్నాడు.

"మీరు కంగారుపడకండి వదినమ్మా, వస్తూనే ఉంటారు" అన్నాడు. ఆమె ఏడ్పు ఉధృతంగా మారిందే తప్ప, ఆమె అతని మాట వినిపించుకోలేదు. సంపత్ విసిగిపోయాడు. మెల్లగా గంగారావును వెతుకటానికి బయలుదేరాడు. వాళ్ళిది వరకు నివాసము చేసిన చోట్లు వెతికాడు. అతను కనిపించలేదు. నెమ్మదిగా తిరుగుముఖం పట్టాడు. ఓ చిన్న హోటల్లో కూర్చుని ఉన్నాడు గంగారావు.

"గంగన్నా!"బయటినుండే పిలిచాడు. నోరూరించే ఫలహారా లున్నాయి. లోపలికి వెళ్ళి, వాటివంక ఆశగా చూడటము ఇష్టము లేదు.

"యెవరూ....సంపత్, దా....దా...." గంగారావు పిలిచాడు.

"నువ్వు రా గంగన్నా వదిన అదుర్దా పడుతోంది."

"యెందుకూ? నేనింకా బ్రతికే ఉన్నానని చెప్పు."

"ఆమాటేదో నువ్వే చెప్పాలి. మొదట బయటికిరా."

"ఉహుఁ! నువ్వే లోపలికి రా...." అన్నాడు. అప్పటికే అందరూ భోజనాలు ఆపి వీరినే చూస్తున్నారు. లాభం లేదని వెళ్ళాడు. సంపత్ అతని యెదురు కుర్చీలో కూర్చున్నాడు. బేరర్‌ని కేకవేసి మరో మీల్స్ తీసుకురమ్మని చెప్పాడు గంగారావు.

"వద్దులే అన్నయ్యా! నే నింటికి వెళ్ళిపోవాలి."

"ఈ రోజు నేనిస్తాన్లే సంపత్" అన్నాడు గంగారావు పచ్చడి నాకుతూ.

అప్రయత్నంగా సంపత్‌కు ఓ సంఘటన గుర్తుకు వచ్చింది. ఓరోజు హోటల్‌కు పిలిచాడు గంగారావు. భోజనాల అనంతరము మెల్లగా చెప్పాడు.

"డెయర్, డెయర్ మనీ దే, దే పే" అంటూ ఇంగ్లీషులో. జేబులో అర్ధ రూపాయికంటే యెక్కువ లేదు.

"గంగన్నా! పిలిచింది నువ్వు" మొండికేసినట్టు అన్నాడు.

"పిలిస్తే మాత్రం, డబ్బులిస్తానన్నానా ఏం?"

"మరి సాధారణంగా హోటల్‌కు పిలిచినవారే డబ్బులిస్తారు."

"ఇప్పుడు అసాధారణమనుకో."

"సరేలే....ఈసారికిచ్చెయ్యి. ఊర్కే కాదు అప్పుగా."

"లేవంటే,..."

"సరే. వదిన దగ్గరకువెళ్ళి చెబుతాను. వదినా గంగన్న డబ్బు దుబారా చేస్తున్నాడు, హోటల్లో ఇష్టమొచ్చినవి తింటున్నాడని."

"సంపత్.... సంపత్.... ఆ పని మాత్రం చేయకురా తండ్రీ. ఇదిగో హోటల్‌కు డబ్బులే కాదు, నీకు బాసుంది ఇష్టంగా తెప్పించుకు తిను, దాని డబ్బులు ఇచ్చేస్తాను" అన్నాడు. సంపత్ నవ్వుకున్నాడు. భార్యా భర్తల మధ్య యెంత పెద్ద అడ్డుగోడుందో అర్థం అయింది. ఇలాంటి సంసారాలు కోకొల్లలు. తను అలా చేయడు....జరిగిం దేమిటి? 'అన్నం ముందు పెట్టుకొని ఆలోచించే వ్యక్తిని నిన్నే చూశాను సంపత్' పంటి సందులో ఇరికిన కొత్తిమిర కాడ తియ్యటానికి నోరంతా తెరిచి చేత్తో ప్రయత్నం చేస్తూ అడిగాడు.

అలాంటి దృశ్యాలు చూస్తుంటే కంపరం పుట్టినట్టు ఉంటుంది.

"బేసిన్ దగ్గరకు వెళ్ళి ప్రయత్నం




చేయి గంగన్నా" అన్నాడు అతను గట్టిగా నవ్వాడు తుప్పిళ్ళు పడుతున్నా యని కూడా గమనించలేదు

"నిన్ను వదిన సాధిస్తుదంటే తగినంత కారణముంది విసుగ్గా అన్నాడు గంగా రావు జేబురుమాలు తీసి అతని చేతులు తుడిచి బేసిన్ దగ్గరకు వెళ్ళాడు సంపత్ మెల్లగా అన్నం ముందుకులాగి పప్పు కలిపాడు ముద్ద నోట్లో పెట్టుకుంటె చేదుగా రుచించింది ఆకలిని ఓదార్చా లన్నట్టు ముద్దలు మింగి నిళ్ళు పోసు కున్నాడు పెరుగన్నం పూర్తి అవుతుండగా వచ్చాడు గంగారావు బుగ్గన కిర్లీ బిగిం చాడు

"అప్పుడే భోజనము అయిందా?" ఆశ్చర్యంగా చూచాడు

"ఆఁ" అన్నాడు చెయ్యి కడుక్కుని వస్తూ ఇద్దరూ బయటికి వెళ్ళారు

"నువ్విక్కడ భోజనము చేస్తూ హాయిగా ఉన్నావు వదిన రాత్రి భోజనము చెయ్యలేదు నీ కోసం ఆందోళన పడు తుంది ప్రొద్దున్నే పెద్దాడు మీరంటే ఆలయానికి వచ్చినట్టున్నాడు ఏమిటి ఎముకలు పుర్రెలున్నాయట

"ఉష్' అదంతా మాట్లాడకూడదు

"మెంటకు?"

"భగవంతుని బిడ్డలమయిన మేము ఏ పనిచేసినా ప్రశ్నించే హక్కు మీకు లేదు"

"భగవంతుని బిడ్డలా మీరు, ఒహ్హో ఇదెక్కడి వితండ వాదమయ్యా' చుట్టు ప్రక్కల క్రిష్టియన్స్ లేరు పుణ్యం"

"మా పద్ధతి నీకు హాస్యాస్పదంగా కనిపిస్తుందా?నువ్వు నరకంలో పడతావు"

"నేను పడే సంగతి దేవుడెరుగు, మొదట నీ భార్య ప్రత్యక్ష నరకము అనుభవిస్తోంది"

"ఆ పాపికి అంతే కావాలి "

"గంగన్నా!"

"అవును సంపత్, నే నింటిని రానని చెప్పు నెలా, నెలా కొంత డబ్బు పంపి స్తాను పిల్లలతో యెలాగో ఏడవమను వివాహమయిన పదేళ్ళల్లో ఒక్కనాడంటే ఒక్కనాడు నన్ను శాంతంగా బ్రతుకనియ్య లేదు పొదుపు పేరిట నా కడుపు మాడ్చింది నా సరదాలు చంపేసింది నన్నొక జీవచ్ఛవంలా తయారుచేసింది అన్నాడు ఆవేశంగా

"గంగన్నా ప్లీజ్ ఇంటికి పద సావకాశంగా మాట్లాడుకుందాము నా కిప్పుడు నీతో వాదించే ఓపికలేదు "

"నా నిర్ణయము చెప్పాను బలవంతం చేసినా లాభంలెదు "

"సరే నేను చెప్పేది చెప్పాను నీ ఇష్టం అమ్మ ఆరోగ్యం బొత్తిగా బాగా లేదు ఒకసారి ఆమెను చూడటానికి రా '

"ఏమైందిరా సంపత్ పిన్నికి"

"నా అసమర్థత ఆమెను పీల్చి పిప్పి చేస్తుంది" అన్నాడు ఆఫీసుకు టైమ్




అయిందంటూ అతను వెళ్ళిపోయాడు సంపత్ సరాసరి సుశీల దగ్గరకు వెళ్ళాడు ఆమె పిల్లల్ని బడికి పంపి కూర్చుంది సంపత్‌ను చూస్తూనే లేచింది

"మీ అన్నయ్య జాడ ఏమయినా తెలిసిందా సంపత్?"

"ఆ! ఆయన క్షేమంగా ఉన్నాడు కాని ఇంటికి రావటానికి సుముఖంగా లేరు వదినా"

"యెందుకు సంపత్, యెందుకట?

"వదినా! విషయము చెబితే నువ్వు బాధ పడతావు ఒకరిని ఒకరు అర్ధంచేసు కోవాలి ఏ చిన్న అపార్ధమైనా జీవితరాగం అప్రశృతులు పలుకుతుంది' అన్నాడు ఆమె మాట్లాడలేదు

"బయటికి వెళ్ళి సంపాదించే మనిషి కదా, కాస్త కడుపునిండా భోజనము పెట్టాలి" సంపత్ నోటిగుండా అలాంటి మాటలు వస్తాయని ఆశించలేదు అదిగాక తన బలహీనత అతనికి తెలిసిందని ఉక్రోషము వచ్చింది బావురుమంటూ రెండు చేతులతో ముఖం కప్పుకుంది

"వదినా! కొన్నిసార్లు సబలల్లా సవాలు చేస్తారు మరికొన్నిసార్లు అచ్చు అబలల్లా ప్రవర్తిస్తారేం? ఏడుపు యెందుకు సావకాశంగా ఆలోచించండి సాయంత్రము అమ్మను చూడటానికి వస్తానని చెప్పాడు అప్పుడు ఆయనతో మాట్లాడు' అతనింకేదో చెప్పబోతుండగా బాబు హడావుడిగా వచ్చాడు ఒరేయ్ సంపత్ అరుస్తున్నాడు

"ఏమిట్రా గొడవ!"

"ఏం లేదురా ఇదిగో మా నాన్న ఈ ఉత్తరము వ్రాశాడు నిజంగా వెళ్ళిపోయా

డంటావా?" బాబు ఓ కాగితం తెచ్చి ఇచ్చాడు సంపత్ చదువుకున్నాడు

"బాబు నే నున్నంత కాలము నీవు బాధ్యతలకు దూరం అవుతుంటావు అందుకే వెళ్ళిపోతున్నాను వస్తానో రానో తెలియదు నీ ఆస్తి సమాజానికే ధార బోస్తావో, బీదలకే పంచిపెడతావో నీ ఇష్టం రొక్కము మాత్రం నాకు అందేలా ఏర్పాటు చేసుకున్నాను "

"ఊఁ" సంపత్ బాధగా నిట్టూర్చాడు ప్రపంచములో ఆనందంగా ఉన్నామన్న వారు ఒక్కరూ కనిపించరు

"ఏరా మాట్లాడవు"

"నీకు స్వేచ్ఛ లభించింది హాయిగా ఉండు ఆయన రాకపోక లెందుకురా నీ నీ పార్టీ ఉంది మీరంతా సంఘజీవులు, సంఘంకోసము బ్రతికేవారు" అన్నాడు వెటకారంగా

"బ్రతుక లేనంటావా మహారాజులా బ్రతుకుతానురా" రోషంగా తల యెగరేస్తూ వెళ్ళిపోయాడు బాబు

"ఏమిటి సంపత్ రామనాధంగారు నిజంగా ఇల్లు వదిలారంటావా నేను నమ్మను ఆతనికి ఈ ఇంటిలో ఉన్న ప్రతి వస్తువుపై మమకారమే ఆఖరుకు మట్టితీసి గిన్నెలు తోమినా దెబ్బలాట కొచ్చేవాడు" అన్నది సుశీల కళ్ళు ఒత్తుకుని

"అక్కడే ఉంది వదినా చిక్కు ఇలాంటివారు యెంత గాఢంగా మమకారము పెంచుకుంటారో అంతే బలముతో తెచ్చుకుంటారు కూడానూ ' అన్నాడు అది నిజమే సంపత్ మెల్లగా అస్తానాను కలుద్దామని బయలుదేరాడు

# 16

బాబు వెళ్ళిపోయినా సునీతి అలాగే కూర్చుంది ఎన్ని కోర్కెలతో తను సంపత్‌తో స్నేహము చేసింది అంతా తెగిపోయిన గాలిపటంలా అయింది అతను వారం రోజుల గడువు కోరాడు తను రాలేకపోయాడు ఆమె మనసు పూర్తిగా మొద్దువారినప్పుడు అన్న మాట లకు ప్రాముఖ్యము ఇచ్చి దాదాపు తెగ తెంపులు చేసుకోవాలని చూస్తున్నాడు అతనితో గడిపిన అపురూపమైన క్షణాలు గుర్తుకు వచ్చాయి ఊహలతో విహరిస్తూ కిటికీ దగ్గర వెళ్ళి నిల్చుంది తామిద్దరూ అక్కడే నిల్చుని కాఫీ త్రాగేవారు

"అమ్మా సునీతీ" నీరసంగా శివరాజు గారి కంఠము వినిపించింది కళ్ళు తుడుచుకుని గదిలోకి వెళ్ళింది

"యెవరమ్మా వచ్చింది?"

"సంపత్ స్నేహితుడు నాన్నా"

"డబ్బు తెచ్చాడా"

"వారం రోజులు గడువు అడిగాడు నాన్నా "

"అలాంటి వారాలు యెన్ని అయినా ఉఁ ఆఁ ఆ డబ్బు రాదు ఈ చేయి ఇలా పొట్టమీదికి చేర్చు" అన్నాడు

అంతవరకు సంపత్ విషయములో సానుభూతిగా ఆలోచించిన సునీతి హృదయము ఒక్కసారి మళ్ళీ రాయిలా అయింది చిన్న కుర్రాడిలా తిరిగే తండ్రి అవిటివాడయ్యాడు తండ్రేకాదు తమ జీవితాలే అవిటి అయ్యాయి వెళ్ళి అతని చేయి పొట్టమీదికి చేర్చింది అన్నింటికి కారణము సంపత్ అనుకుంది

"ఇల్లు యెలా గడుస్తుందమ్మా?"

"యెలాగో, ఒకలా గడుస్తుంది,ఇప్పు డవ్వన్నీ ఆలోచించకు నాన్నా నిన్న ప్యారి అండ్ ప్యారి స్వీట్స్ ఏజెన్సిలో వేకన్సీ వుందని చెప్పారు అది నా కిప్పిస్తా నని నా స్నేహితురాలు చెప్పింది' అన్నది

"రాముడికి మరో ఉత్తరము రాయి'' అన్నాడు అతన్ని బాధపెట్టడం ఇష్టంలేక అలాగే అంది తండ్రి దయనీయ స్థితికి జాలిపడింది

"సుతులగన్నది గతుంకొరకు అన్నా రమ్మా మా గతి ఇక్కడే తేల్చాడు మా రాముడు'' సావిత్రమ్మ ప్రక్కింటామెతో అంటుంది తల్లిని పిలిచింది

"ఏమిటే ఈ పాడు నడుము ఒకటే నొప్పి' ఆమె లోపలికి వచ్చింది

"ఎందుకమ్మా మన విషయాలు నల్గు రికి చెప్పి పలుచన కావటము'" విసుగ్గా అడిగింది

"అయ్యో తల్లీ! ఇంట్లో కూర్చుంటే ఏం తోస్తుందే అదికాక నాల్గు విష యాలు తెలుసుకోవద్దా? బ్యాంకువాళ్ళ కెవ రికో ఇల్లు కావాలట క్రింది భాగము ఇద్దా మని అంటున్నాను" అన్నది

"అవునమ్మా ఈ సామాన్లు కూడా అమ్మేద్దాం అనవసరమైనవి చాలా ఉన్నాయి" సోఫాల వంక బీరువాల వంక చూచింది

"రాముడికి ఉత్తరం రాయే యెద కాలుతుంది" ఆవిడ యెద రాసుకుంది తల్లికి యెప్పుడూ ఉన్న జబ్బే అనుకుని అన్నకు ఉత్తరము రాద్దామని కూర్చుంది అప్పుడే రాము అత్త, మామలు వచ్చారు

## "నిన్న - రేపు - నేడు"

నిన్న—

విరిగిన పాలు
వాడిన పూలు
చెల్లని చెక్కు!

రేపు—

వ్రాయని గ్రంథానికి వ్యాఖ్యానం
పుట్టని బిడ్డకు నామకరణం
వట్టి ప్రామిసరీనోటు!

నేడు—

ప్రగతికి విత్తు
అందిన ఫలం
అరచేతి నగదు!
వెచ్చించే ప్రతి క్షణం
మర్చిపోకది అమూల్యం!

—పిప్పళ్ళ సూర్యప్రకాశరావు

ఆశ్చర్యంగా, ఆనందంగా యెదురు వెళ్ళింది తమకింత కష్టము వచ్చినా రాని వారు ఈరోజు వచ్చారంటే ఆశ్చర్యమే

"నమస్తే అత్తయ్యా మామయ్యా"

"నమస్తే " ముక్తసరిగా చెప్పారు వచ్చి కూర్చున్నారు

"మీనాన్నగారికి పక్షవాతమట కద " రాము మామగారు, కామరాజు అడిగాడు

"అవునండీ అన్నయ్యను రమ్మని రాశాను ఉత్తరాలు అందాయో లేదో " సందేహంగా చూచింది సునీతి

"అందే ఉంటాయి రోగానికి డాక్టర్లు మందిస్తారు యెవరొచ్చి మాత్రం ఏం చేస్తారమ్మాయ్ " మిసెస్ కామరాజు







అడిగింది సునీతికి మండిపోయినా ఊర్కుంది నిజమే అన్నట్టు తలూపింది

"ఊఁ రేపు వస్తానని రామము రాశాడమ్మాయ్ " కామరాజు చెప్పాడు

"అన్నయ్య వస్తున్నాడా? ఇప్పుడే ఉత్తరము రాద్దాం అనుకుంటున్నాను" సునీతి అంతకు క్రితం వారన్నమాట కూడా మరిచి పోయింది, అన్న వస్తున్నాడన్న ఆనందములో

"వ్యవహారాలన్నీ యెవరు చూస్తున్నారు?" ఆరాగా అడిగాడు

"నేనే చూస్తున్నాను" సునీతి చెప్పింది

"అప్పులేనా ఆస్తి అంటూ ఏమయినా మిగిలిందా?" అతను అడిగిన తీరు చూస్తే కుర్చీ యెత్తి అతని ముఖాన వేద్దామనిపించింది

"ఆ వివరాలు అంత తొందరగా తేలుతాయా?"

"ఒహో, మా అమ్మాయికి అప్పుడే పదిహేను వేలు కట్నం ఇచ్చాము "ఆవిడ ముఖం చిట్లించింది

"యెవరే " సావిత్రమ్మ వచ్చింది ఆమెకు వియ్యంకుడికి, వియ్యపురాలని చూడగానే బాధ కోపం రెండు కలిగాయి ఏదో తీవ్రంగానే అనబోయింది సునీతి కళ్ళతో చేసిన హెచ్చరిక చూచి మాట్లాడక నిల్చుండిపోయింది

"రేపు అన్నయ్య వచ్చాక అన్నీ చూచుకోండి" అన్నది

"చూచుకోవాలనే వచ్చాము నమ్మి నానబోస్తే పుచ్చి బుర్రలయినట్టుంది మా పని ఏదో ఆస్తిపరులని అప్పుడిచ్చాము" ఇద్దరూ బాధపడ్డారు

"పదిహేనువేలు ముంచేటంతగా దిగజారలేదు మేమింకా అన్నయ్యను రానివ్వండి" అన్నది కోపము దిగమింగుతూ

"ఆయన వచ్చినాకే వస్తాం" ఇద్దరూ లేచి వెళ్ళిపోయారు

"ఏమిటే ఇది?" భోరున ఏడ్చింది సావిత్రమ్మ

(సశేషం)

# తీయని ప్రయాణం



"వెళ్ళొస్తానమ్మా" అంది అనసూయ, చెప్పుల్లో కాళ్ళు దూరుస్తూ

"ఉఁ వెళ్ళు అట్టే రోజులు ఉండి పోకు" అంది ఈశ్వరమ్మ అనసూయ తల్లి

"అలాగే" అంది అనసూయ వీధిలోకి వస్తూ

ఈశ్వరమ్మ ఎప్పటిలా కూతురితో పాటుగ వీధిలోకి రా లేదు ఇంట్లోనే ఉండిపోయింది ఆవిడకు కూతురి ప్రయాణం ఏ మాత్రం ఇష్టంలేదు

అనసూయ బాధపడింది క్షణం సేపు తల్లికి అయిష్టమయిన పని చేస్తున్నానే అని కాని, తను విశాఖపట్నం వెళ్ళక తప్పదు

వీధరుగుమీద నుంచుని, ఖాళీ రిక్షాకోసం ఎదురు చూడసాగింది

అయిదు నిముషాల తర్వాత ఓ ఖాళీ రిక్షా అటు వైపు వస్తే స్టేషనుకు బేర మాడి ఎక్కి కూచుంది

పావు గంటలో రిక్షా రైల్వే స్టేషనుకు చేరుకుంది టిక్కెట్టుకొని, ప్లాట్‌ఫారం మీదకు ఆమె వచ్చిన అయిదు నిముషాల్లో రైలొచ్చింది

ఆడవాళ్ళ కంపార్టుమెంటు వెదికి పట్టుకుని ఎక్కింది కంపార్టుమెంటు ఖాళీగా ఉంది కిటికీకి ప్రక్కన సీటు చూసుకుని కూచుంది

---

కంచర్ల రమణ

పావుగంట తర్వాత బండి బయలు దేరింది

స్టేషన్లు ఒకదాని తర్వాత ఒకటి వెనక్కి వెళ్ళిపోతున్నాయి కాని, అనసూయ మనస్సు మాత్రం తనున్న ప్రపంచంమీద లేదు

'విశాఖపట్నంలో ఉన్న తన స్నేహితురాల్ని అర్జంటుగా కలుసుకోవాలి' అన్న సాకు చెప్పి, విశాఖపట్నంలో ఉన్న రామచంద్రాన్ని కలుసుకోవడానికి బయలు దేరింది అనసూయ

అనసూయ అకస్మాత్తుగా విశాఖపట్నం బయలుదేరడానికి కారణం, పది రోజుల క్రితం రామచంద్రంనుంచి వచ్చిన ఉత్తరం

''అనూ! ఎందుకింకా నామీద ఆశలు పెంచుకుంటావు పెళ్ళయి నాకు ఇద్దరు పిల్లలు ఇహ పిల్లలు పుట్టకుండా ఆపరేషను కూడా చేయించుకొన్నాను నా వయస్సు ఇప్పుడు ముప్పై ఆరేళ్ళన్న మాటేగాని, ప్రేమ పెళ్ళి వగైరా విషయాలు ఆలోచించే దశ ఏనాడో దాటిపోయింది ఇహ నేను ఆలోచించవలసింది నా పిల్లలు పెద్దవాళ్ళయి భవిష్యత్తులో బాగుపడ్డం ఎలా అని

చిలకలా చెప్పిందే చెప్తున్నాననుకోకు ఎస్సెల్సీ రెండుసార్లు పోయిందని, మరి ఆ విషయం తలవడమే మానేసావు ఇప్పుడు ఆ పరీక్షలు లేకపోయినా, మెట్రిక్‌కు కట్టు గట్టిగా చదివితే పాసయి తీరతావు నీ దృష్టి అలా చదువుమీదకు మళ్ళించు నీ జీవితానికో లక్ష్యం ఏర్పడుతుంది పరీక్ష పాసయి చిన్న ఉద్యోగం నీవు సంపాయించుకోగలిగితే, మంచి పెళ్ళి సంబంధం కూడా ఎస్తుంది నా మాట విను '' అని ఉత్తరం రాసాడు రామచంద్రం

ఉత్తరంలోని ప్రతి మాటా తనకు గుర్తే వచ్చాక దాన్ని అయిదారుసార్లన్నా చదివింది

రామచంద్రం వద్దనుంచి ఉత్తరం వచ్చినప్పుడల్లా ఏడ్చేది అనసూయ కాని, ఈసారి దుఃఖానికి బదులు కోపం పొంగుకుని వచ్చింది ఉత్తరం చదివిన ప్రతి తడవకూ ఆమె కోపం హెచ్చిందే గాని ఉపశమించలేదు

రామచంద్రానికీ, అనసూయకూ ప్రథమంగా ఓ బంధువులింట్లో పరిచయం ఏర్పడింది అప్పటికి రామచంద్రానికింకా పెళ్ళి కాలేదు

పరిచయం ప్రేమగా మారి ''మనిద్దరం పెళ్ళి చేసుకుందాం అని ఒకరికొకరు వాగ్దానం చేసుకునే దశకు రావడానికి రామచంద్రం ఆ బంధువులింట్లో ఉన్న మూడు రోజులు సరిపోయాయి

వారానికి రెండు ఉత్తరాల చొప్పున సంవత్సరంపాటు వారిద్దరి ప్రణయం కొనసాగింది ఈ లోపున వాళ్ళు రెండుమూడుసార్లకు మించి కలుసుకోవడం జరగలేదు అప్పుడు కూడా ఒకరికి దగ్గరగా ఒకరు కూచోవడం, చేతులు కలుపుకోవడం, మరీ ఆవేశం పైబడితే ముద్దుపెట్టుకోవడానికి మించి దూరం పోలేదు వారి ప్రేమాయణం

విచిత్రమైన పరిస్థితులవల్ల రామచంద్రం అనసూయను పెళ్ళి చేసుకోలేదు తల్లి




దండ్రులు తెచ్చిన సంబంధం చేసుకొన్నాడు

తను ఎలాంటి పరిస్థితులకు లొంగిపోయి తల్లిదండ్రులు కుదిర్చిన సంబంధం చేసుకోవాల్సివచ్చిందో, వివరంగా పెద్ద ఉత్తరం రాసాడు రామచంద్రం అనసూయకు

ఆ ఉత్తరం చదివి కన్నీరుమున్నీరుగా ఏడ్చింది అనసూయ తను బాధపడినంతగా, రామచంద్రం కూడా బాధపడ్డాడని అతను రాసిన ఉత్తరంలోని ప్రతి మాటా పలుకుతోంది కానయితే రామచంద్రం రాజీపడ్డాడు పరిస్థితులతో

అందుకే రాసాడు, ఉత్తరం చివరలో "నిన్ను నేను మర్చిపోలేను అనూ। ప్రేమికులుగా గాకపోయినా, స్నేహితులుగా నైనా మనం ఉత్తరాలు రాసుకుంటే తప్పేమిటి? ఉత్తరాలు రాయడం మానీకు అనూ।"

వారం రోజులపాటు ఇహ రామచంద్రానికి ఉత్తరం రాయకూడదనుకుంది అనసూయ

కాని, రామచంద్రానికి ఉత్తరాలు రాయకుండా ఉండలేకపోయింది

'తాము ప్రేమికులు కాదు స్నేహితులు మాత్రమే' అని వారు ఉత్తరాలు కొనసాగిస్తున్నప్పటికీ అప్పుడప్పుడు పాత ప్రేమలు ప్రస్తావనలోకి రావడం మానలేదు

అలాంటి సమయాల్లో అనసూయ గుండెలు బద్దలయ్యేవి దుఃఖంతో తానను భవించిన మానసిక యాతన గురించే రాసేది అనసూయ ఆ తరువాతి ఒకటి రెండు ఉత్తరాల్లో

అయిదేళ్ల గడిచిపోయాయి ఈ అయిదేళ్లలో నాలుగయిదుసార్లు కలుసుకున్నారు రామచంద్రం, అనసూయలు

రామచంద్రం కనిపించినప్పుడు అనం

దంతో ఎంత పొంగిపోయేదో, అతడు వెళ్లిపోగానే, అంతగానూ కుంగిపోయేది అనసూయ ఆ తరువాత వారం పది రోజులవరకూ ఆమెకు నిద్ర వచ్చేది కాదు తిండి సహించేది కాదు అసలు మానవమాత్రుడెవ్వడ్నీ చూడాలనిపించేది కాదు మోకాళ్ల మధ్య తల పెట్టుకుని రొదిస్తూ ఒంటరిగా చీకటి గదిలో కూచునేది

గడచిన అయిదేళ్లల్లో రామచంద్రంకు ఇద్దరు పిల్లలు కలిగారు కష్టపడి డిపార్టుమెంటు పరీక్షలు పాసయి ఉద్యోగంలో రెండు మెట్లు పైకెక్కాడు

అనసూయ పోయిన స్కూల్ ఫైనల్ పరీక్ష గురించి మరి తలవలేదు అయితే ఈలోపున ఎవరో సలహా ఇచ్చారు ఆమెకు హిందీ పరీక్షలు పాసవడం సులువని, హిందీ పండిట్‌గా ఉద్యోగం సంపాయించుకోవడం కూడా సులువని

అనసూయ హిందీ పరీక్షలకు కట్టసాగింది రెండు పరీక్షలు పాసైంది మూడవది పాసైతే హిందీ పండిట్ అవుతుంది ఆ పరీక్ష పాసైతే, ఉద్యోగం ఇప్పిస్తానని ఓ పెద్ద మనిషి వాగ్దానం కూడా చేసాడు అయితే ఆ పరీక్షకు రెండు సార్లు వెళ్ళి తప్పింది

మూడవసారి ఆ పరీక్షకు వెళ్తుంటే, ఆమెలో అంతర్మథనం మళ్లా మొదలైంది

అటు ప్రేమలోనూ, ఇటు జీవితంలోనూ దేవుడిలా తనను అన్యాయం చేసాడేం?

రామచంద్రం పదేపదే గుర్తుకు రాసాగాడు అతడు వివాహితుడు పిల్లల తండ్రి అన్న విషయం సైతం లక్ష్యం చెయ్యకుండా, అతన్ని తన కలల్లో నింపుకోసాగింది

అయినప్పటికీ, అప్పుడప్పుడు అతడికి పెళ్లయిందన్న విషయం ముల్లులా ఆమె మనస్సును చురుక్కుమని బాధించక పోలేదు

'అయితేనేం? తనను రెండో భార్యగా స్వీకరిస్తాడు లేదా ఉంచుకుంటాడు లోకంలో ఇలాంటి ఏర్పాట్లతో ఎంత మంది బ్రతకడంలేదు?' అనుకుంది మొండిగా

దాంతో మళ్లా రామచంద్రంతో తన జీవితం పంచరంగుల్లో ఊహించుకోసాగింది

అయితే, రామచంద్రంనుంచి ఎలాంటి ప్రోత్సాహం లేదు అలాగని ఉత్తరాలు రాయడం మానలేదు

ఒకానొక సందర్భంలో 'రామచంద్రం తన జీవితంతో ఆడుకోవటం లేదు గదా?' అన్న అనుమానం వచ్చింది ఆమెకు ఒక్కసారి, ఆ కోణంలోంచి గతాన్నంతా పునఃపరిశీలన చేసింది అంతే,

ఆ అనుమానం బలపడనారంభించింది

తన జీవితంతో ఆటలాడుకోవాలన్న ఉద్దేశమే రామచంద్రానికి లేకపోతే, పెళ్ళయిన వెంటనే తనకు ఉత్తరాలు రాయడం ఎందుకు మానలేదు?

పెళ్ళయి పిల్లలు కలిగాక కూడా, ఎందుకు తనను కలుసుకోవడానికి ఉబలాట పడ్డాడు?

'స్నేహితులుగా ఉత్తరాలు రాసుకుందాం' అని రామచంద్రం ఉత్తరాలు



కొనసాగించడంలోనే అతడి ఉద్దేశం బయటపడుతోంది

రామచంద్రం తనను ప్రేమించలేదు తనంటే ఒక స్త్రీ పడి ఛస్తోంది అన్న భావాన్ని, అనుభూతిని ప్రేమించాడు అందుకే తనను ఉత్తరాలు రాయమన్నాడు తను రాసాడు

క్రమంగా రామచంద్రం మీద ప్రేమ ద్వేషంగా మారింది కసి కలిగించి అయితే తను ఆడది, అతడ్ని ఏం చెయ్యగలదు?

పెళ్ళయి పిల్లలతండ్రి అయ్యాక కూడా, అతనితో తను ఉత్తరాలు నడిపిందంటే, లోకం తననే దోషిగా పరిగణిస్తుంది

ఏది ఎమైనా తన బ్రతుకు ఒక అర్ధం లేని వ్యవహారంగా మారింది

రామచంద్రం గట్టుమీంచి చూసి ఆనందిస్తున్నాడు తను కష్టాల కెరటాల తాకిడికి ఉక్కిరి బిక్కిరయి ఛస్తుంటే

లాభం లేదు! రామచంద్రం శిక్ష అనుభవించకుండా తప్పించుకోవడానికి వీలులేదు

అయితే, యేం చెయ్యాలి తను?

అనసూయ తీవ్రంగా ఆలోచించింది, రెండు రోజులు

కొద్ది నెలల్లో తనకు ఇరవై యెనిమిదేళ్ళు నిండిపోతాయి పెద కట్నాలు యిస్తేగాని తనను పెళ్ళి చేసుకునే విశాల హృదయుడు కనుచూపు మేరలో ఎవడూ లేడు తన బ్రతుకు యెలాగూ గాడీ తప్పిన బండి అయ్యింది

తన భర్త శ్రీరామచంద్రుడంతటి ఏకపత్నీవ్రతుడన్న నమ్మకంతో వుండి వుంటుంది రామచంద్రం భార్య పెళ్ళికాక పూర్వం తనతో ప్రేమ వ్యవహారం నడిపాడని ఆమెకు చెప్పి ఆమె నమ్మకాన్ని

దెబ్బ తీస్తే

ఆ మాత్రం చాలు! స్వర్గంలాంటి అతని యిల్లు దుర్భర నరకమవుతుంది అనుకూలవతి అనురాగవతి అయిన అతని యిల్లాలు అతడి మొదటి శత్రువవుతుంది

అందుకే అనసూయ బయలుదేరింది విశాఖపట్నం, రామచంద్రం మీద కసితో, కుతకుతలాడిపోతున్న మనస్సుతో

సాయంకాలం అయిదు కావస్తుండగా రైలు విశాఖపట్నం చేరుకొంది రిక్షా కట్టించుకుని, డాబా గార్డెన్‌లో ఉన్న రామచంద్రం యింటికి వెళ్ళేసరికి, పావు తక్కువ ఆరయింది

అప్పుడే ఆఫీసు నుంచి వచ్చినట్టున్నాడు రామచంద్రం యింటి వద్దనే ఉన్నాడు అనసూయ తలుపు తట్టగానే అతడే తలుపు తీసాడు

చేతిలో సంచీతో, మొహంలో తీక్షణమైన చూపుతో ఎదురుగా నించున్న అనసూయను చూడగానే ఆశ్చర్యపోయాడు రామచంద్రం

"నువ్వా! అనసూయా? ఎవరో అనుకున్నాను ఏమిటిలా వచ్చావు" అన్నాడు రామచంద్రం

తనలా రావడం అతనికి యిష్టం లేదు అందుకే అలా ప్రశ్నించాడని అర్థం చేసుకుంది అనసూయ

"యేం! నేను రావడం యిష్టం లేదా?" అడిగింది అనసూయ సీరియస్‌గా అతడి కళ్ళల్లోకి చూస్తూ

రామచంద్రం మొహం నల్లబడింది కాని, మరునిముషంలోనే తేరుకుని-

"ఛ! ఛ! ఏమిటా మాటలు?" అంటూ అనసూయను లోనికి తీసుకెళ్ళాడు

నడవలోంచి రామచంద్రం భార్య చూస్తోంది ఆసక్తిగా, ఎవరొచ్చారా అని

"అనసూయని నాకో ప్రాణస్నేహితురాలుందని చెప్పానే, ఆమే యీమె" అంటూ భార్యకు అనసూయను పరిచయం చేసి "ఈమె నా భార్య నా అర్ధాంగి నా మిసెస్ వగైరా వగైరా అన్నపూర్ణ నామధేయురాలు" అంటూ నాటక ఫక్కీలో తన భార్య అన్నపూర్ణను పరిచయం చేసాడు

అన్నపూర్ణ గలగలా నవ్వేసింది ఆమెలా అనసూయ కూడా నిర్మలంగా యింకోకప్పుడయితే నవ్వి ఉండేది అలాగని సీరియస్‌గా కూడా వుండలేకపోయింది చిన్న చిర్నవ్వు మాత్రం మొహం మీదకు తెచ్చుకుంది

ఈ లోపున రామచంద్రం యిద్దరి పిల్లలూ అక్కడకు చేరారు, అనసూయను ఎగాదిగా చూస్తూ

"ఎవరు నాన్నా ఆవిడ? ఎవరు నాన్నా?" అడిగింది పెద్దపిల్ల రామచంద్రం ప్రక్కకు చేరి, అతడి చెయ్యి లాగుతూ

"ఎవరా?" అని ఆగి అనసూయ మొహంలోకి, కూతురి మొహంలోకి క్షణంసేపు చూసి బుంగమూతి పెట్టి "ఉహూఁ నేను చెప్పను చెప్పడానికి పావలా చార్జి అవుతుంది అన్నాడు చిలిపిగా

"ఓకే నాన్నా! పావలా యేగా రూపాయి యిచ్చాను పో! చెప్పు మరి!" అంది అమ్మాయి- తండ్రి అంత చిలిపిగా




"అయితే ఆమె నీకు ఆంటీ అవుతుంది తే రూపాయి'' అన్నాడు రామచంద్రం కూతురి మొహంలోకి తమాషాగా చూస్తూ

"వాళ్లేంటి తండ్రి కూతుళ్ళ హాస్యాలు! ఇంటికి వచ్చినవారికి మర్యాద చెయ్యడం ఏమన్నా వుందా లేదా? అంది అన్నపూర్ణ మధ్యలో జోక్యం కలిగించుకుని

"ఇదిగో డియర్! పరిచయాలు చెయ్యడం నా వంతు ఆ పని కానిచ్చాను మిగతాదంతా నీ పనే'' అని అక్కడున్న ఓ కుర్చీలో కూలబడ్డాడు రామచంద్రం

"రండి! ఆయనతో మనకేమిటి?'' అంటూ అనసూయ చెయ్యి పుచ్చుకుని లోనికి తీసుకెళ్ళింది అన్నపూర్ణ

అనసూయ ఎంత వద్దంటున్నా అనసూయ స్నానం కోసం నీళ్ళు ఏర్పాటు చేసింది అన్నపూర్ణ

పది నిముషాల్లో అనసూయ స్నానం ముగించుకుని వచ్చేసరికి, ఓ ప్లేటులో పొగలు కక్కుతున్న ఉప్మా, ఇంకో చేతిలో కాఫీ గ్లాసుతో ఎదురయ్యింది అన్నపూర్ణ

ఫలహారం చేస్తోందన్న మాటేగాని, అనసూయ మనస్సు అల్లకల్లోలంగా ఉంది

తను వచ్చింది, రామచంద్రం బ్రతుకు బండలు చెయ్యడానికి వారి ఆతిథ్యం స్వీకరించడానికి కాదు

రేపు తను రామచంద్రానికీ తనకూ మధ్య జరిగిన ప్రణయ వ్యవహారం గురించి ఆమెకు చెబితే తను కన్పరిచిన ఆప్యాయతకూ యిచ్చిన ఆతిధ్యానికి అన్నపూర్ణ ఎంత నొచ్చుకుంటుందో?

నొచ్చుకోనీ? తనకేం! తను బాధలు పడ్డప్పుడు ఎవరైనా అలా అనుకున్నారా? అలా అనుకుంటే, తనీ దుస్థితిలో ఉండేదా?

వాళ్ళు అందించిన ఆతిధ్యమంతా పుచ్చుకుని, ఫెళ్ళున కొట్టినట్టుగా రామచంద్రం బండారం బయట పెట్టడంతోనే ఉంది రక్తి

"చాలా థేంక్సండీ" అంది అనసూయ కాఫీ త్రాగాక కాళీ గిన్నెలు కడిగి తీసుకురావడానికి లేచింది చేతిలో గిన్నెలతో

"ఛ, ఛ, యీ మాత్రం దానికేనా థేంక్సు?" అంది అన్నపూర్ణ, అనసూయ చేతిలోని గిన్నెలు లాక్కుంటూ

"ఆఁ యిప్పుడు చెప్పు మీ అమ్మగారెలా వున్నారు?" రామచంద్రం అక్కడకు వచ్చి అన్నాడు

గిన్నెలు కడగడానికి అన్నపూర్ణ లోనికి వెళ్ళిపోయింది

"బాగానే ఉన్నారు" క్లుప్తంగా జవాబిచ్చింది అనసూయ

"మీ అక్కా వాళ్ళూ?"

"ఓఁ వాళ్ళూ బాగానే ఉన్నారు"

"మరి, మీ అక్కగార్కి ఆ యిద్దరు పిల్లలేనా? ఆ తరువాత కూడా ఏమన్నా" అంటూ తన పొడుగైన చెయ్యి పైకీ క్రిందికీ పుటాకారం సూచిస్తూ త్రిప్పాడు

ఆ క్షణంలో రామచంద్రం ఎదఏ కోపమూ లేకపోయి ఉంటే అనసూయ విరగబడి నవ్వేసేది రామచంద్రం యాక్షనుకి అయినా ఎంత సీరియస్‌గా ఉందామన్నా ఉండలేకపోయింది

చిరునవ్వు నవ్వక తప్పలేదు

"ఆహాఁ మరి లేరు" అంది ఆ చిన్నవ్వు కూడా అపుచుంటూ

"మీ అన్నయ్య ఎమాత్రం డబ్బు పంపుతున్నాడిప్పుడు?"

"నెలకు వంద"

"కొంత నయం మునుపు పాతికే పంపేవాడు

ఆ తరువాత ఇంకేం కుశలప్రశ్నలు వెయ్యాలో రామచంద్రానికి బోధపడలేదు

"ఇవాళ రెండో ఆట సినిమాకు వెళ్దాం తయారై కూచోండి ఈ లోపున నాకో చిన్న పనుంది వస్తా" అంటూ రామచంద్రం అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు

ఆ సమయంలోనే, రామచంద్రం గురించి చెప్పాల్సినవి అన్నపూర్ణకు చెప్పేద్దామనుకుంది అనసూయ కాని




మనసు మార్చుకుంది ''ఇద్దరి సమక్షంలోనే రామచంద్రం పాపఫలం బద్దలు కొడతాను అనుకుంది

రాత్రి తొమ్మిదవుతుండగా భోజనాలయ్యాయి పిల్లల్ని తీసుకుని బయలుదేరారు రామచంద్రం అన్నపూర్ణ అనసూయ గూడా వారితోపాటుగ సినిమాకు వెళ్లక తప్పలేదు వాళ్లంతా బలవంతం చేసారు

ఇంటర్వెల్‌లో పిల్లలు కూల్‌డ్రింక్స్ కొసం అల్లరి చేసారు తనకేమీ అక్కర్లేదనీ, అన్నపూర్ణ హాలులోనే ఉండిపోయింది అన్నపూర్ణతోపాటుగ తనూ ఉండిపోతానంది అనసూయ

రామచంద్రం ఊరుకోలేదు పిల్లలతోపాటుగ బయటకు వచ్చి కూల్‌డ్రింక్ త్రాగి తీరాలని అనసూయను పట్టుబట్టాడు అయిష్టంగానైతేనేం, అనసూయ వెళ్ళింది

కూల్‌డ్రింక్స్ త్రాగుతున్నప్పుడు అడిగాడు రామచంద్రం ''ఏమిటిలా వారాత్తుగా మా మీద దయ పుట్టుకొచ్చింది?' అని

సాయంకాలంలాగే వాడిగా ఏదో జవాబిద్దామనుకుంది అనసూయ ఆ సంగతి రామచంద్రం అర్థం చేసుకున్నట్టున్నాడు ఆమె మాట్లాడ్డానికి పెదవి కదిపేంతలోనే ''అహఁ' నువ్వు రావడం ఎమాత్రం ఇష్టం లేదనుకోకు సుమీ నువ్వు ఇల్లు కదిలి ఇంతదూరం వచ్చావంటే ఏదో ముఖ్యమైన పనేదో ఉండివుండాలి అది తెలుసుకుందామని అని అన్నాడు

ఆ మాటలతో దురుసుగా సమాధానం ఇచ్చే తన ప్రయత్నం విరమించుకుంది అనసూయ ఎప్పటిలా మొహంమీద చిరునవ్వు ధరించి ''రేపు చెప్తానులే అదంతా సస్పెన్సుగా ఉంచడం నా కిష్టం రేపటి వరకు ' అంది

''అబ్బా' అంత సస్పెన్సేమిటి?''

అని ఇంకా రామచంద్రం ఏదో అన బోతుంటే, ఇంటర్వెల్ ముగిసినట్టు గంట మ్రోగింది త్వరత్వరగా అందరూ హాలు లోకి వెళ్లిపోయారు

పావు తక్కువ ఒంటిగంట కావస్తుండగా సినిమా అయిపోయింది

పిల్లలు పడుకున్న గదిలో అనసూయకు ప్రక్క ఏర్పాటుచేసింది అన్నపూర్ణ

ఎందుకో అవాళ రాత్రి ప్రశాంతంగా నిద్రపోయింది అనసూయ

ఉదయం అయిదు గంటలకే ఆ ఇల్లు మేల్కొంది ఎనిమిది గంటలకే రామచంద్రం ఆఫీసుకు వెళ్ళాలెమో, అన్నపూర్ణతోపాటుగ రామచంద్రం కూడా లేచాడు స్నానాదికాలు ముగించుకుని వచ్చేలోపల అతనికి టిఫిను తయారుచేసి ఇచ్చింది అన్నపూర్ణ ఆ తరువాత ఇంకో గంటలో వచ్చే కారియర్ మనిషికి కారియర్ అందివ్వడానికి వంట గూడా ఆరంభించింది

అనసూయకు కూడా తెల్లవారుఝామున అయిదు గంటలకు లేచే అలవాటుంది. అందువల్లనే, అలారం విన్నట్టుగా టక్కున ఆమెకు గూడా మెలకువ వచ్చింది

వాళ్ల పనులకు అడ్డం పడ్డం తప్ప లేచి తను చేసేదేమీ లేదని తెల్సుకుని మంచంమీద అలాగే పడుకుని నిద్ర నటించసాగింది

ప్రక్క గదుల్లోంచి భార్యాభర్తల సంభాషణ స్పష్టంగా వినవస్తోంది అనసూయకు

"అనసూయను చూస్తుంటే నా గుండెలు పగిలిపోతున్నాయి పూర్ణా'

అంటున్నాడు రామచంద్రం

"బాధపడి మనం మనస్సులు పాడు చేసుకోవడం తప్ప ఆమె కేవిధంగా ఉపయోగపడగలం చెప్పండి" అంటోంది అన్నపూర్ణ

"అదేమిటో పూర్ణా' దేవుడు కరుణామయుడంటారు కాని ఆమె విషయంలో మాత్రం బండరాతి బొమ్మ అటు పరీక్షల్లో తప్పుతోంది ఇటు పెళ్ళి జరిగే అవకాశం లేదు ఆమె అన్ని బాధ్యతలూ మీదను వేసుకుని తండ్రిలా ప్రవర్తించవాల్సిన అన్నయ్యా వీళ్ళను దూరంగా వుంచి భరణం ఇస్తున్నట్టు నెలకింతని డబ్బు వీళ్ళ మొహాన్న కొడుతున్నాడు అని అనసూయ పరిస్థితులు రామచంద్రం చెప్తుంటే బ్రతుకులో ఉన్న తమాషా యేమిటోగాని కొంతమంది బాధపడ్డానికే పుట్టినట్టు నానా అవస్థలు పడతారు ఎటు ఆశగా తిరిగితే అటు నుంచే దెబ్బ తగులుతుంది' అని అన్నపూర్ణ వ్యాఖ్యానించింది

"ఇహ లాభంలేదు పూర్ణా' చిన్నదో చితకదో ఓ ఉద్యోగం అనసూయకు చూస్తాను ఏ ఆనందమూ, ఏ తృప్తీ లేకుండా అనసూయ బ్రతుకు శిథిలమయిపోతుంటే చూస్తూ ఊరుకోలేను

రామచంద్రం కంఠంలో దృఢ నిశ్చయం ధ్వనించింది

"అలాగే చెయ్యండి మనల్ని మనం ఉద్ధరించుకోవడంలో గొప్పతనం లేకపోలేదు కారణం ఏమంటే మనం సమాజానికి బరువు కావడం లేదు అయితే ప్రతి మానవుడు తనను తాను అర్థం చేసుకోవడంతోనే సమాజంపట్ల తన



కర్తవ్యం పూర్తయిందనుకోగూడదు ఇంకొకర్ని ఉద్ధరించె కనీస యత్నమన్నా చెయ్యాలి'' అంది అన్నపూర్ణ

''పైమయిపోయింది పూర్ణా' వెళ్ళొస్తాను

ఆ సంభాషణ అక్కడితో ఆగిపోయింది

ఆ తరువాత రామచంద్రం వీధిలోకి కదిలి వెళ్ళిపోయినట్టుగా పాదాల చప్పుడు, తలుపులు దభేలుమని మూసుకున్న శబ్దం వినవచ్చాయి

అన్నపూర్ణ నిశ్శబ్దంగా వంట జేసుకుంటున్నట్టు, వంటింట్లోంచి పంపు స్టవ్ రొద, గిన్నెల చప్పుడు వినవస్తోంది

ఇక్కడ గదిలో తన మీద తిరగబడ్డ అంతరాత్మకు జవాబిచ్చుకోలేక సతమతమవుతోంది అనసూయ

వాళ్ళు తన్నెలా అనుకుంటున్నారు? తను వాళ్ళ బ్రతుకు యేం చేయాలని కోరి యిలా వచ్చింది?

తమను తాము బాగుచేసుకోవడంతోనే సమాజంపట్ల వ్యక్తి కర్తవ్యం పూర్తి కావడం లేదు చేతనయినంతగా ఇతర్లను కూడా ఉద్ధరించాలని వారు తన బ్రతుకు గురించి ఓ ఆవేదన ఆరాటం కన్పరుస్తుంటే, తనేం తలుస్తోంది వాళ్ళ గురించి?

నవ్వుల పువ్వులతో విరాజిల్లే వారి జీవితనందనంలో నిప్పులు కురిపించాలని వచ్చింది'

ఏమయింది తనకు? తనని ఏ దెయ్యమో పట్టలేదుగదా? ఎందుకిలా వక్రించింది తన బుద్ధి?

తనని ఒకనాడు రామచంద్రం ప్రేమించాడు నిజమే! కాని, తనతో యేనాడూ చనువు తీసుకోలేదు, పెళ్ళికాక పూర్వం గాని, ఆ తర్వాత గాని అదే యింకో యువకుడయితే తను చూపిన చనువు

ఆసరాగా తీసుకుని తన శీలాన్ని దోచేసి ఉండేవాడు మరి రామచంద్రమో? ఉద్రేకానికి ఆస్కారం యివ్వకుండా, ఆలోచన మాత్రమే పొసగనిచ్చి తనతోటి తన ప్రేమను మనోహరమైన స్నేహంగా మలుచుకోవాలని తపించాడు

"అదేమిటంటీ? ఎందుకేడుస్తున్నారు?" అన్నపూర్ణ గదిలోకి వచ్చింది కంగారుగా అనసూయకు చేరువగా వచ్చి కూర్చుంది

అప్పటికిగాని అనసూయకు అర్థం కాలేదు, తను ఏడుస్తోందని, తన కన్నీళ్ళతో తలగడ తడిసి ముద్దయిందని

"అబ్బే! యేడుస్తున్నానా?" అంటూ ఆత్రుతగా లేచి, చెంపలు తుడుచుకుని "స్ట్రాంగ్ కాఫీ యివ్వరూ? తల బ్రద్దలయిపోతోంది నొప్పితో" అంది అనసూయ

"ఒక్క కాఫీయే నేమిటి? టిఫిను కూడా సిద్ధం మీరు మొహం కడుక్కుని రావడమే ఆలస్యం" అంది అన్నపూర్ణ లేచిన అనసూయను బాత్ రూంకు తీసుకెళుతూ

మొహం కడుక్కోవడమే గాదు, అలా స్నానాదికాలు కూడా ముగించి అరగంటలో వచ్చింది అనసూయ

టిఫిను తిని కాఫీ త్రాగాక "అలా ఓ అరగంట బజారుకెళ్ళి వస్తానండి ఇవాళ సాయంకాలం రైలుకే తిరిగి వెళ్ళిపోవాలనుకుంటున్నాను" అంది అనసూయ

పది నిముషాల్లో తల దువ్వుకుని, చీర మార్చుకుని వీధిలో బడింది అనసూయ

ఇందాక బాత్ రూంలో ఉన్నప్పుడే లెక్కలు వేసుకొంది తిరుగు ప్రయాణం టిక్కట్టు డబ్బు పోను, చేతిలో యింకా పదిరూపాయలుంటాయి దోవలో తనకు కాఫీ త్రాగడానికి కూడా కానీ మిగలక పోవచ్చు అయినా ఫరవాలేదు రామచంద్రం పిల్లలకు ఏమైనా పది రూపాయలతో తినుబండారాలు కొని తీసుకురావడానికి నిశ్చయించుకుంది

బజార్లో పది రూపాయలకు విలువ లేదు రెండు క్రీమ్ బిస్కట్ పేకట్లు మాత్రం కొని తెచ్చి యిద్దరి పిల్లల చేతుల్లో చెరొకటి పెట్టింది అనసూయ

మొట్టమొదటిసారిగా ఆ యిద్దరినీ దగ్గరికి తీసుకుని ప్రేమతో ముద్దు పెట్టుకొంది

"ఎందుకండీ - యివన్నీను?" అంది అన్నపూర్ణ, పిల్లల చేతుల్లోని పేకట్లు చూసి

"ప్రయాణం అయి రావడం తొందరలో మర్చిపోయానండి పిల్లలున్న యింటికి ఒట్టి చేతులతో వెళ్ళగూడదు" అందంగా అబద్ధం చెప్పింది అనసూయ

సాయంకాలం పావు తక్కువ అయిదు కావస్తుండగా రామచంద్రం ఆఫీసునించి వచ్చాడు

రామచంద్రం రాగానే అతనితో చెప్పి వెళ్ళిపోవడానికి సిద్ధంగా వుంది అనసూయ

కనీసం ఒక్కరోజు తన ప్రయాణం వాయిదా వెయ్యమని మరీ మరీ బ్రతిమలాడింది అన్నపూర్ణ

అనసూయ మనసు మార్చుకోలేదు

అన్నపూర్ణ అందించిన కాఫీ గ్లాసుతోపాటు, అనసూయ ఆ సాయంకాలమే

ఊరికి తిరిగి వెళ్ళిపోతోందన్న వార్త కూడా అందుకున్నాడు రామచంద్రం భార్యద్వారా

"నో, నో! ఆవిడ వెళ్ళిపోతానంటే నువ్వేలా ఒప్పుకున్నావే" అన్నాడు రామచంద్రం చిరుకోపం ప్రదర్శిస్తూ

"ఆ విషయమే నేనూ అన్నానండి కాని ఆవిడ ససేమిరా ఒప్పుకోవడం లేదు" అంది అన్నపూర్ణ

రామచంద్రం యింకా యేమేమో అనబోయాడు కాని, మధ్యలో కల్పించుకుని "రామచంద్రం' మరీ అంత మొండిపట్టు పట్టకు నువ్వు రమ్మంటే రాలేదు, నువ్వుండమంటే ఉండిపోవడానికి" అంది అనసూయ

"అది సరే' నువ్విలా గాలీ వానలా వచ్చి, వానాకాలం సూర్యుడిలా మాయం కావడం అర్థం కావడం లేదు ఇంతకీ ఎందుకొచ్చావో చెప్పావు కావు అసలు నువ్వొచ్చిన పని అయిందో లేదో చెప్పలేదు చూస్తే రోజంతా యింట్లోనే వున్నావు యెక్కడికీ కదల్లేదల్లే వుంది" అన్నాడు రామచంద్రం

"అదంతా పెద్ద సీక్రెట్ నాకు చెప్పడం యిష్టం లేదు చెప్పమని బలవంతం చెయ్యకు నన్ను వెళ్ళిపోనీ' " అంటూ వంగి రామచంద్రం, అన్నపూర్ణ పాదాలకు నమస్కరించింది అనసూయ

ఆ దంపతు లిద్దరి కళ్ళల్లో ఒక్కసారిగా కన్నీళ్లు ఉబికాయి గొంతుకలు గద్గదమయ్యాయి కాసేపు యెవ్వరూ ఏమీ మాట్లాడలేక పోయారు

"చూడు అసూ' యీ సంవత్సరం లోగా నీకేదైనా ఉద్యోగం చూస్తాను నీకు ఉద్యోగం చూసి, నీ బ్రతుక్కి ఓ గమ్యం అర్థం యేర్పరచే వరకూ విశ్రమించను" అన్నాడు రామచంద్రం అనసూయ తల నిమురుతూ

అనసూయ మనసులో అనుకుంటోంది "నాకు ఉద్యోగం దొరికినా దొరక్కపోయినా చింతలేదు ఘోరాపరాధం చెయ్యడానికి వచ్చి జ్ఞానోదయం కలిగి చెయ్యకుండా వెళ్ళిపోతున్నాను ఆ ఆనందం, ఆ తృప్తి చాలు యీ జన్మకు"

అన్నపూర్ణతో కూడా చెప్పేసి, అక్కడ నుంచి కదలుదామని, ఆమె వైపు తిరిగితే ఆమె అక్కడ లేదు

కాని రెండు నిముషాల్లో ఓ పళ్ళెంలో జాకట్టు గుడ్డ రెండు అరటిపళ్ళు, పసుపు కుంకుమలతో వచ్చింది అక్కడకు అన్నపూర్ణ

"అబ్బే' ఎందుకండీ యివన్నీను" అంది అనసూయ, అన్నపూర్ణ తనకు పళ్ళెం అందిస్తుంటే

"తప్పు! వద్దకూడదు తీసుకోండి" అంటూ అనసూయ చేతిసంచిలోకి పళ్ళెంలోని వస్తువులు పంపింది అన్నపూర్ణ

అనసూయ మరి కాదనలేకపోయింది

పిల్లలిద్దర్నీ దగ్గరకు తీసుకుని ముద్దు పెట్టుకుని, "వస్తాను రామచంద్రం స్టేషనుకు వచ్చే ప్రయత్నం చెయ్యకు ఒక్కర్తినీ వెళ్ళగలను" అంటూ అతడు ఆమెను స్టేషనువరకూ సాగనంపడానికి వస్తానంటున్నా విన్పించుకోకుండా వీధిలోకి నడిచి, రిక్షా కట్టించుకుని వెళ్ళిపోతున్న అనసూయను చూసి కొయ్యబొమ్మలా ఉండిపోయాడు రామచంద్రం అనసూయ ఎందుకొచ్చినట్టు, ఎందుకు వెళ్ళిపోతున్నట్టు అర్థంగాక

ఎప్పటికీఅర్థం చేసుకోలేడేమో కూడా *

# సార్థకమైన చదువు

విద్యద్వారా మనం నేర్చుకొన్న విజ్ఞానం నలుగురికీ పంచగలిగిన నాడే ఆ విద్యకు సార్థకత ఏర్పడుతుంది 'యూనివర్సిటీ విమెన్స్ అసోసియేషన్' పేరిట ఆ సంస్థ సభ్యులు నిర్వహించే కార్యకలాపాలు వారి చదువుకు సార్థక్యత కలుగజేస్తూనే వున్నాయి

సభ్యులందరూ పట్టభద్రులే అయిన ఈ సంస్థ 13వ బైనియల్ సమావేశాలు ఇటీవల మద్రాసులో జరిగాయి యావద్భారత ప్రాతినిధ్యంతో రెండు సంవత్సరముల కొకసారి వేర్వేరు పట్టణాలలో యీ సంస్థ సమావేశమౌతుంది

అరులైన విద్యార్థినులకు ఉపకారవేతనం అందజేయడం, స్కాలర్‌షిప్పులు ఇచ్చి విదేశాలకెళ్ళి ఉన్నతవిద్య నభ్యసించేందుకు అవకాశాలు కల్పించడం, విద్యా, సాంస్కృతిక, సాంఘిక రంగాలనుండి ప్రముఖుల నాహ్వానించి సమావేశాలు ఏర్పాటు చేయడం, విద్యార్థినీ, విద్యార్థులకు చర్చలు ఏర్పాటు చేయడం, యీ సంస్థ చేపట్టి నిర్వహిస్తున్న కొన్ని కార్యాలు

ఈ సంస్థ సభ్యులు, స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యలను చర్చించి పరిష్కరించడానికి శాయశక్తులా సహాయం చేస్తున్నారు భార్యాభర్తల ఆదాయాన్ని ఉమ్మడిగా లెక్కించి ఆదాయపు పన్ను వేయాలని ప్రభుత్వం తలపెట్టినప్పుడు, మద్రాసు బ్రాంచి సభ్యులైన శ్రీమతి మనోభక్తవత్సలం ఆధ్వర్యాన ఒక ఆడ్‌హాక్ కమిటీ ఏర్పాటుచేసి నగరంలోని ఇతర స్త్రీల సంస్థల నన్నింటిని కూడగట్టుకొని సభలు, సమావేశాలు జరిపి స్త్రీలలో అలజడి లేవదీసి ప్రధానమంత్రివరకు రాయబారం జరిపి అది జరుగకుండా ఆపివేశారు

వేసవి సెలవల్లో విశ్వవిద్యాలయంవారు ఏర్పాటుచేసే ఇన్‌ఫర్మేషన్ బ్యూరోలో ఈ సంస్థ సభ్యులు పాల్గొని విద్యార్థులకు న్యాయ, అర్థిక, మన స్తత్వ శాస్త్రాలలో వారికి గల సంశయాలు చర్చించి, విపులీకరించి ఆయా సబ్జెక్టులు బోధపడుటకు సహాయపడుతున్నారు

ఈ అసోసియేషన్ మద్రాసు విభాగానికి అధ్యక్షురాలుగా శ్రీమతి సరోజా గురుస్వామి, కార్యదర్శినిగా శ్రీమతి రాజ్యలక్ష్మి సుంకవల్లి, కోశాధికారిణిగా శ్రీమతి విజయారావు ఉన్నారు వీరు ముగ్గురూ తెలుగువారే కావడం, 'తెలుగు స్త్రీ'కి గర్వకారణమే!

ఈ సంస్థకు భారతదేశంలో గల విభాగాలలో మద్రాసు విభాగం అన్నిటి కన్న మిన్నగా పనిచేస్తోంది క్రితంసారి జపానులో జరిగిన అంతర్జాతీయ సమావేశానికి మద్రాసునుంచీ అయిదుగురు ప్రతినిధులు హాజరయ్యారు

ఈ సంస్థ 1975 నవంబరు 16న స్వర్ణోత్సవ సభ జరుపుకొంది మద్రాసు కలెక్టరు మిస్ రమేష్ ప్రారంభించిన యీ సభకు ఆలిండియా యూనివర్సిటీ విమెన్స్



ఫొటోలోనివారు (ఎడమనుండి కుడివైపుకి) 1. మిస్. రమేష్, కలెక్టరు ఆఫ్ మద్రాసు, 2. శ్రీమతి సరోజాగురుస్వామి, మద్రాసు బ్రాంచి అధ్యక్షురాలు, 3. ప్రొఫెసర్ షణ్ముగసుందరం (Prof. Economics, University of Madras), 4. శ్రీమతి రాజ్యలక్ష్మి సుంకవల్లి, మద్రాసు అసోసియేషను శక్రటరీ, 5. మిస్. మైత్రేయిరామాదురై, నేషనల్ అసోసియేషన్ శక్రటరీ, 6. శ్రీమతి వై. జి. గోపాలరత్నం, నేషనల్ అసోసియేషను, ప్రెసిడెంటు, 7. మిస్. డాక్టరు బీనారాయ్, ఢిల్లీ, 8. శ్రీమతి వత్సలా నారాయణస్వామి.

---

అసోసియేషన్ ప్రెసిడెంట్ డా॥ మిస్ బీనారాయ్ అధ్యక్షతన జరిగింది. ప్రొఫెసర్ షణ్ముఖసుందరం (యూనివర్శిటీ ఆఫ్ మద్రాసు) స్వర్ణోత్సవ ఉపన్యాసం ఇచ్చారు.

పదిమందికీ ఉపయోగపడే ఇటువంటి సంస్థలకు అవసరమయినంత ప్రచారం లేకపోవడం దురదృష్టకరం. ఉత్సాహమున్న ఇటువంటి సంస్థలద్వారా ఇతరులకు సేవచేసే అవకాశం ఎంతమందికో లేకుండా పోతోంది. ఈ సంస్థ 'తనను గురించి తాను' అందరికీ తెలిసేలా పాంప్లెట్లద్వారా గాని, ప్రకటనలద్వారా గాని ప్రచారం చేసుకొనడం అవసరం.

ఈ సంస్థ గురించిన వివరాలు మరింత విపులంగా తెలుసుకొనగోరువారు యూనివర్సిటీ విమెన్స్ అసోసియేషన్, కేరాఫ్ జ్యోతి చిరునామాకు రాయవచ్చును

—జ్యోతి ప్రతినిధి

# ఈ నెల విడుదలలు

యావద్భారతమంతా వ్యాపించిన కీర్తి గల ఒకే ఒక సంగీత దర్శకుడు ఎస్. డి. బర్మన్. ముప్ఫైఏళ్ళుగా దాదాపు వంద సినిమాలలో, పూజా రికార్డులలో సుమారు వెయ్యి పాటలు వినిపించి అసంఖ్యాకమైన ప్రజానీకాన్ని అలరించిన అద్వితీయ సంగీత గురుడు. అతని చివరి చిత్రాలైన "బారూద్", "త్యాగ్" రెండూ పాలిడార్ రికార్డులే. (2392, 077, 6405, 023). ఇంకా రెండు చిత్రాలున్నవి కాని అవి ఎస్. డి. స్వరపరచగా ఆర్. డి. వాద్యగోష్ఠి అమర్చి రికార్డు చేసినవి. పై రెండు చిత్రాలలో "త్యాగ్" సంగీతం వింటే విడిచి వెళ్ళలేనటువంటిది. ఎస్. డి. దే మరొక ఎల్. ఎల్. పి "తేరే మేరే సప్నే" (2392 009) కూడా యింతటి ఖజానాయే. ఇటువంటి స్వచ్ఛందమైన సచ్చిన్ స్వర శకలాలు మనతోబాటు కలకాలం మనగలవు.

*　　*　　*

మదన్ మోహన్ యిన్ని సినిమాలు చేయలేదు, ఇంత ప్రసిద్ధుడూ కాలేదు. కాని కొన్ని పాటలు వింటూంటే మదన్ మోహన్ కాదు వాడు మధుర్ మోహన్ అనిపిస్తుంది. "భాయ్ భాయ్" లో "షరాబీజా", "ఫిఫ్టీ ఫిఫ్టీ" లో గీత పాడిన "శాంక ఆంచల్ ఢల్ కా" పాటలలో ఎంత హాయి పొదివిపెట్టాడో! హెచ్. ఎం. వి. వారు మదన్ స్మృత్యర్థం విడుదలచేసిన ఎల్. పి. లో (EALP 4079) పన్నెండు పాటలున్నవి. ప్రతి ఒక్కటీ చక్కని పాటే. కాని మదన్ మోహన్ స్వంతంగా పాడిన "మాయిరీ" అన్నది (దస్తక్ లోనిది) తీపి గుర్తులతో గుండెలు కోస్తుంది. రికార్డుపై యింతకు ముందు విడుదల కాని ఈ పాటను విడుదల చేసి మదనాభిమానులకు సంతోషం కలిగించిన హెచ్. ఎం. వి. వారు అభినందనీయులు. రికార్డు కవరు చాలా హుందాగా ఉన్నది. స్లీవ్ నోట్స్ లేక పోయిన కొరతను నాలుగు దాచుకోతగ్గ ఫొటోలు కొంత కొంత తీర్చినవి. ఇతని రాబోయే చిత్రాలు "మౌసమ్", "అస్లీయత్" వగైరా.

*　　*　　*

ఆ మధ్య ప్రతి నెలా వయలార్ పాటలు ఒకటో, రెండో పరిచయము చేస్తున్నప్పుడు కొందరు పాఠకులు వ్రాసేవారు, మలయాళం గొడవ మాకెందుకండీ అని. మీ కేమైన వయలార్ దగ్గరివాడా అని ఒక తుంటరి వ్రాసాడు కూడాను. సంస్కృత సాహిత్యంలోని సౌరభం సామాన్య శ్రోతకు వేలాది వయలార్ పాటలు అందించిన తీరు ఆయనను నాకు దగ్గరివాడినే చేసినది. ఆయన పాటలలో సౌందర్యము నన్ను మలయాళ సాహిత్యారాధకునిగా చేసింది. ఆయన పాటలు ప్రతిపదార్థం చెప్పించుకొనడం వలన ఆ భాషతో నా పరిచయం పెంపొందడమే కాక రసికత, అందాన్ని అర్థం చేసికోగల సామత పెరిగింది. మలయాళ సాహిత్యానికి యెనలేని సేవచేసిన

స్వాతి తిరునాళ్, వల్లతూళ్ సమవుజ్జ వయలార్ అని కేంద్ర ప్రభుత్వముతో గ్రహింపజేసి ఒక తపాలబిళ్ళ విడుదల చేయించే బాధ్యత కేరళ ప్రభుత్వముపై యెంతైనా ఉన్నది. ఆయన ఘనత తెలుసుకోవాలంటే "ఎన్నెనిన్ కక్కు కల్" (విష్ణు విజయం 2221) పాట అర్థం తెలుసుకొని వినండి.

* * *

పాలిడార్ ఫిలిప్స్ యి. పి. లు:

"సిడలేని ఆడది", "అమ్మాయిల శపథం" చిత్రాలలో నాలుగేసి పాటలు యిప్పుడు యి. పి. లపై విడుదలచేశారు (2221 16, 2221 166). త్వరలో పాలిడార్ పై రాబోయే తెలుగుచిత్ర సంగీతం "మాంగల్యానికి మరో ముడి" దని తెల్పుతున్నారు వారి ప్రతినిధి ఆనందరెడ్డి.

"బారూద్" లో మూడేసి పాటలు ఒక వాద్య సంగీత ఖండికలతో రెండు యి. పి. లు విడుదలైనవి (2221 163, 164). అందరూ ఎక్కువగా అడుగుతున్న ఆశా గీతం "ఐ లవ్ యూ, యూ లవ్ మీ" రెండవ దానిలో వున్నది.

"ఆజ్ రాత్ శో" (2221 175) లో మూడు చక్కటి పాటలున్నవి. 'దూల్హా రాజా మేరా' వినడం ఘోడా స్వారీ చేయడమే! సంగీతం ఉత్సాహానికి మరీ పేరయిన ఆర్. డి. పాడినది ఆశా, కిశోర్, రఫీ.

సూపర్ హిట్స్ వరుసలలో (2221 169, 170, 171, 172) పన్నెండు బ్రహ్మాండ హిట్లు చిత్రాని కొకటి, రికార్డుకి నాలుగు చొప్పున పొందుపరచబడాయి. "చత్తే చత్తే" లో మరో యి. పి. లో (2221 168) చక్కని వర్ణ చిత్రాలలోని మూడు పాటలు ముచ్చటగా వున్నవి. "రాణీ ఔర్ లాల్ పరీ" పాటలు రెండు మాక్సి యి. పి. లలో (2253, 018, 014) వచ్చినవి. గణపతిని ప్రస్తుతి శాక నాలుగు మరాఠీ గీతాలు సుమన్ కళ్యాణ్ పూర్ మహారాష్ట్ర దేశీయ సంగీతానికి మంచి ఉదాహరణలు. (2253 724 మాక్సీ) జైనులకు రెండు యి. పి. లు) "అనంత్ కీ అనుగూంజ్", "ఆనంద్ ఘన్ కే పద్" (2221 880, 881) లో పాటలు బెంగుళూరు వర్ధమాన భారతి వారి స్థాయిలోనే ఉన్నవి. పాలిడార్ వారింతటివరకు విడుదల చేసిన సినిమా యి. పి. లలో అతి నాసిరకముగా ఉన్నవి. "బాగేలుట్ రా" యి. పి. (2221 142) సంగీతం, పాడిన తీరు, మాటల్లో అన్నీ దాదా దారుణమే. నకిలి నజా పాడిన "జామ్ ఉఠాతా" ఖవ్వాలీలు (6284 619) అపస్వరాల పుట్టలు, అనుకరణల మెట్టులు.

* * *

పాలిడార్ ఫిలిప్స్ ఎల్. పి. లు:

క్రిస్మస్ ఎల్. పి. లు మూడు. అందులో బాగాలేనిది క్రిస్మస్ గాస్పెల్స్ (710 019). ఒకటే గోల అరుపులు. ఉండవలసిన కమ్మని తావులు లేనే లేవు. బాగా వున్నది గుంటర్ కాల్మన్ కాయిర్ (2371 100) ఒక డజను ఖండికలలో క్రిస్మసు వాతావరణాన్ని పట్టేశారు. ఇంకా బాగున్నది క్రిస్మస్ విత్ ది ప్లాటర్స్ (6430 009) 'జంగిల్ బెల్స్' 'రుడాల్ఫ్ ది రెడ్ నోస్డ్ రెయిన్ డీర్' మొదలైనవన్నీ వున్నాయి.

రి.బం; రి.కం.వై; రి.శ్రో.స.




## ఓ 'మంచి మనిషి' కథ

కాలేజిలో సైన్సులో పట్టభద్రుడయిన ఓ మనిషి తన జీవితాన్ని సినిమా రంగంలోకి లాక్కొచ్చి ప్రజాభిమానం పొంది కళలో పట్టభద్రుడయాడు. మొదట విజయవంతమైన నిర్మాతగా, తర్వాత విజయవంతమైన దర్శక నిర్మాతగా ప్రేక్షకాభిమానాన్ని పుష్కలంగా పొందిన ఆ వ్యక్తి పేరు వి బి రాజేంద్ర ప్రసాద్ జగపతి పతాకాన్ని ఎగరేసి తెలుగు చలనచిత్రసీమలో ముఖ్యుడుగా మారిన యీ దర్శక నిర్మాత ఇప్పటి ప్రయత్నం ఆయన మంచితనానికి చక్కని నిదర్శనంగా నిలిచింది. తాను చిత్రనిర్మాణం ప్రారంభించినప్పటి నుండీ జగపతి సంస్థలో తనకు చేదోడుగా నిలిచిన సిబ్బందికి సంక్షేమార్థం 'జగపతి స్టాఫ్ ఎంటర్ ప్రైజస్' పేరిట 'పిచ్చి మారాజు' ను సమర్పిస్తున్నాడీ మంచి మనిషి. శోభన్ బాబు, మంజుల ప్రధాన పాత్రలలో నిర్మించబడిన ఈ రంగుల చిత్రం సంక్రాంతికి విడుదలవుతుంది. దర్శకత్వం రాజేంద్ర ప్రసాదే నిర్వహిం



"సోగాడు" లో జయచిత్ర, గిరిబాబు, శోభన్‌బాబు



''నిజం నిద్రపోదు'' లో రామకృష్ణ, మమత

చారు. 'మంచి' కోసం నిర్మించబడ్డ యీ చిత్రం మంచి ఫలితాన్నివ్వక మాను తుందా?

## ఎర్ర ముద్దబంతి పువ్వు!

ఎరుపురంగు ముద్ద బంతి పువ్వుకాదిది. అరుణా (ఎరుపు) ఆర్ట్ పిక్చర్స్ నిర్మించే చిత్రం పేరిది. సంచలన దర్శకుడుగా (స్వర్గం నరకం చిత్రంతో సంచలన నటుడిగా కూడా) తెలుగు చిత్ర పరిశ్రమలో ప్రయోగాలు చేస్తున్న దర్శకుడిగా పేరొందిన దాసరి నారాయణరావు దర్శకత్వంలో తయారవుతోంది చిత్రం. 'స్వరాజ్యం లేచి పోయింది' పేరును ప్రజాభిప్రాయుల సేకరణ పిమ్మట 'ముద్ద బంతి పూవు'గా మార్చుకొని తయారవుతున్న యీ చిత్రంలో మురళీ మోహన్, సత్యనారాయిణ, జయచిత్రలు నటిస్తున్నారు



''బంగారు పతకం''లో శివాజీ గణేశన్



"భక్త కన్నప్ప" లో కృష్ణంరాజు, వాణిశ్రీ

## 'జ్యోతి' చిత్రాలు!

మీరు చదువుతున్న 'జ్యోతి' తాలూకు చిత్రాలు కొన్ని వున్నాయి

వాటిలో మొదటిది జ్యోతి! 'జ్యోతి' పేరుతో ఓ చక్కని చిత్రం నిర్మించబడుతోంది అంతా అవుట్ డోర్ లోనే నిర్మాణం జరిగే యీ చిత్రాన్ని యువ దర్శకుడు రాఘవేంద్రరావు దర్శకత్వంలో క్రాంతికుమార్ నిర్మిస్తున్నారు జయసుధ, మురళీ మోహన్ లు నటించే ఈ చిత్రం నిర్మాణం చురుగ్గా సాగుతుంది 'అన్నపూర్ణ ఎంటర్ ప్రైజెస్ చిత్రమిది

యువ రచయిత జి. యస్ సూరి రచించిన 'ఈ ఉత్తరానికి జవాబు రాదు' నవలను జ్యోతి సప్లిమెంట్ ప్రచురించింది. జవాబు రాదన్న పేరేగాని ఆ నవలకు వెంటనే జవాబొచ్చింది రాజమండ్రినుంచి వెంగళరెడ్డి అనే నిర్మాత ఈ నవలను చిత్రంగా తీస్తున్నారు. 'జరుగుతున్న కథ' పేరిట దాదాపు నిర్మాణం పూర్తి అయిన యీ చిత్రం ద్వారా జ శేషగిరిరావు దర్శకునిగా, ఆర్ వి యస్. రామస్వామి సంభాషణల రచయితగా పరిచయం అవుతున్నారు చంద్రమోహన్, దేవదాస్, సుధీర్, రావుగోపాలరావు, హేమా చౌదరి. సుమిత్ర, కె. విజయ ప్రధాన తారాగణం నిర్మాణసంస్థ వెంగమాంబా మూవీస్.

నాలుగు నెలలపాటు జ్యోతి పాఠకుల్ని నవ్వుల జల్లుల్లో ముంచెత్తిన ప్రేమాయణం నవల చిత్రరూపం పొందుతున్నది.

జ్యోతిలో మీరిప్పుడు చదువుతున్న



"వింతయిల్లు-సంతగోల" లో ప్రభ

సీరియల్ 'మిస్టర్ సంపత్' ఎం. వి. చిత్రరూపం పొందబోతోంది. ఇప్పటి కందిన వార్తల ప్రకారం యీ చిత్రానికి మధుసూదనరావు దర్శకులుగా వుంటారు. శోభన్ బాబు నాయకుడు, మంకొన్ని వివరాలు తర్వాత.

శివాజీ కాదు యస్. పి. చౌదరి!

త్వరలో మీ ముందుకు రాబోతున్నది 'బంగారు పతకం' రంగుల చిత్రం. అందులో పద్మశ్రీ శివాజీ గణేశన్ వున్నాడు. కాని మీకు కనిపించేది శివాజీ కాదు శివాజీ నటించిన యస్. పి. చౌదరి పాత్రే! క్రమశిక్షణగల పోలీసు అధికారిగా శివాజీ నటించిన తీరు అద్భుతం. తమిళంలో అనేక చోట్ల రజతోత్సవాలు జరుపుకొన్న యీ చిత్రాన్ని గీతా ఆర్ట్స్ సమర్పిస్తున్నారు. మెసర్స్ నారాయణమూర్తి, అల్లు అరవింద్ నిర్మించిన ఈ చిత్రంలో కొంగర జగ్గయ్య కంచు కంఠాన్ని వినొచ్చు మీరు.

మూర్ఖత్రయం

రాజబాబు, సత్యనారాయణ, నాగభూషణం, ముగ్గురు ఒకే మూర్ఖులట! పరమానందయ్య శిష్యులకు శిష్యుల్లాంటి యీ ముగ్గుర్నీ 'ముగ్గురు మూర్ఖులు'గా మార్చి మీ ముందుకు పంపే ప్రయత్నం చేస్తున్నారు నిర్మాత, రచయిత మహేష్. కె. హేమాంబరధరరావు దర్శకత్వంలో తయారవుతున్న యీ చిత్రంలో 'ముగ్గురు మూర్ఖుల'తో పాటు గుమ్మడి, దేవిక, రోజారమణి, ప్రభాకర రెడ్డి, మిక్కిలినేని కూడా నటిస్తున్నారు



''పాడిపంటలు'' లో విజయనిర్మల, కృష్ణ

## జయ 'చిత్ర విజయం'!

డి. రామానాయుడు నిర్మించిన పోగ్గాడు ద్వారా తెలుగు తెరకు పరిచయమవుతున్న తమిళ తార జయచిత్ర పోగ్గాడు విడుదలకాబోతున్న సందర్భంలో 'ఫిల్మ్ జర్నలిస్ట్స్ గెట్ టుగెదర్' ఏర్పాటు చేసిందితీవల. 'నేను తెలుగు తెరకు పరిచయమవుతున్న సందర్భంలో మిమ్మల్ని కలిసేందుకు ఈ గెట్ టుగెదర్ ఏర్పాటు చేశాను. నన్ను తెలుగు తెరకు పరిచయం చేస్తోంది రామానాయుడు గారు. నా రెండో తెలుగు చిత్రం విజయ_బాపినీడు గారి నిర్వహణలో తయారవుతున్న 'యువ్వనం



మద్రాసులోని ప్రముఖ సాంస్కృతిక సంస్థ కళాసాగర్ కళాభినేత్రి వాణిశ్రీని సన్మానించినప్పటి దృశ్యం. ఫొటోలో వాణిశ్రీతోపాటు ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖా మంత్రి మండలి వెంకటకృష్ణారావు, వారి సతీమణి వున్నారు.

---

గా చేసింది'. తెలుగులో కూడా తారగా మీ అభిమానం పొందగలనని ఆశిస్తున్నాను. నా ఆహ్వానాన్నందుకుని వచ్చినందుకు కృతజ్ఞతలు' అన్నది జయచిత్ర పత్రికా ప్రతినిధులతో. జయచిత్ర తమిళ తారగా పేరొంది తెలుగులోకొస్తున్న తెలుగమ్మాయి. చాలా కాలం క్రితం 'దైవబలం' చిత్రంలో కథానాయికగా నటించిన అమ్మాజీ కుమార్తె. నటనలో ఈజ్ ఉన్న (సొగ్గాడు గాక జయచిత్ర నటించిన కొన్ని తమిళ చిత్రాలు చూశాడు మా విలేఖరి) జయచిత్ర తెలుగు ప్రేక్షకాభిమానం తప్పక పొందగలదు

## సంక్రాంతి చిత్రం!

తెలుగు నాట సంక్రాంతి పెద్ద గ్రామాలన్నీ ఉత్సాహంతో పొంగి పొరలే శుభసమయం అది. పాడీ, పంటా రైతులకు ప్రాణం. రైతులు దేశానికి ప్రాణం. యీ ప్రాణాలే కృష్ణ సమర్పించే రంగుల చిత్రం 'పాడి పంటలు' 'కథకు' ప్రాణాలు. తెలుగు గ్రామసీమలు అందాల్ని, రైతు బిడ్డల జీవితాల్ని అత్యంత రమణీయంగా చిత్రించి సంక్రాంతికి మీకందించబోతున్నారు పద్మాలయా ఆర్ట్ పిక్చర్స్ వారు పాడి పంటలు చిత్రంద్వారా కృష్ణ, విజయనిర్మల నాయకా, నాయకులైన యీ చిత్రానికి కథ, దర్శకత్వం పి. చంద్రశేఖర్ రెడ్డి నిర్మాత ఆదిశేషగిరి రావు,

## సక్సెస్ బాపినీడు!

పేరులోనే విజయాన్ని కలిగివున్న రచయిత 'విజయ బాపినీడు' నిర్వహణలో శ్యామ్‌ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారు నిర్మిస్తున్న 'యవ్వనం కాటేసింది' దాదాపు పూర్తి అయింది. కృష్ణంరాజు, జయచిత్ర నాయకా, నాయికలుగా నటిస్తున్న ఈ చిత్రానికి దాసరి నారాయణరావు దర్శకుడు. మురళీమోహన్, రావు గోపాలరావు, టి. పద్మిని కూడా నటించే ఈ చిత్రంలో జానకి, గుమ్మడి, అల్లు రామలింగయ్య స్పెషల్‌గా కన్పిస్తారు. నిర్మాత మాగంటి రవీంద్రనాథ్ చౌదరి.

## హాస్యానికి మరణంలేదు!

ఏదైనా తెలుగు శబ్దార్థచంద్రికలో హాస్యం అన్న పదానికి అర్థం 'రేలంగి' అని కన్పిస్తే ఆశ్చర్యపోనవసరంలేదు. తెలుగు చిత్రాలలో హాస్యానికి పరిపూర్ణతను తెచ్చిన రేలంగి అంతటి మహానటుడు మరి. భౌతికంగా దేహం చాలించినా ఆయన నిర్వహించిన లెక్కలేనన్ని పాత్రలు మనల్ని కలకాలం నవ్విస్తూ మనతో ఉంటాయి. వెకిలితనం లేని హాస్యాన్ని పుష్కలంగా అందించి అందర్నీ నవ్విస్తూ బ్రతికిన రేలంగి వెంకట్రామయ్య సార్థకజీవి. ఆయన కుటుంబ సభ్యులకు జ్యోతి సానుభూతి.

—ఎస్వీ నారాయణ.

---

Edited and Published by V. Leelavathy Raghavaiah,
40/1, Moosasait Street, Madras-600 017 and Printed by